కులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

పుటి 19 జనవరి 1982 సంచిక 12

# ఇదీ వరస...



ఈ నెలనవలానుబంధం

## శ్రీవారి అగచాట్లు

రచన

**తోటకూర ఆశాలత**

ముఖచిత్రం: శ్రీదేవి

జ్యోతి, పి. బి. నెం. 1824, హైదరాబాదు-20

# నూతన సంవత్సర శుభాకాంక్షలు!!




కొత్త సంవత్సరం వచ్చింది-పాతలోంచి కొత్తదనంలోకి దారితీయాలి — ఎంతో ఆదరాభిమానాలతో జ్యోతికి చమురుపోసి, వెలుగు పెంచుతున్న పాఠకులకు, ప్రకటన కర్తలకు, రచయితలకు, శ్రేయోభిలాషులకు కృతజ్ఞతలతో పాటు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాము

ప్రతియేటా జరిగే కథలపోటీ సామాన్యమయినదే. భాగ్యలక్ష్మి లాటరీ, జ్యోతి కలసి కథలపోటీ నిర్వహించడం మరొక కొత్త దనపు విశేషం. అలాగే జ్యోతి ఈ సంవత్సరంలో ముందుగా చేపట్టే మరో విశేషం—20 సం॥ జ్యోతి వెలుగులోని చక్కని కథలనికూర్చి ఒక సంపుటిగా సాహితీ ప్రియులకి అందివ్వబోతున్నాము.

ఇంకా కొత్త శీర్షికలని ప్రవేశపెట్టి పాఠకులని సంతోష పరిచే ప్రయత్నం చేస్తాము. మీ అందరి సహృదయంతో జ్యోతిని ప్రకాశింప చేయగలరని ఆశిస్తూ కొత్త సంవత్సరానికి స్వాగతం చెబుతున్నాము.




జ్యోతి సంపాదకులకు-

వారెసిడ్డి సీతాదేవిరాసిన "గాలికథ" మీ ప్రత్యేక (దీపావళి) సంచికలో చదివాం-తరువాత డిసెంబరు సంచిక చూశాము, శ్రీ రామకృష్ణగారి ఉత్తరం చదివేక ఈ ఉత్తరం రాయాలనిపించింది రచయిత్రి వీరేంద్రనాథ్‌పై ఈర్ష్య పడినటు గానీ, వ్యక్తిగతంగా దూషించినట్లుగానీ కనిపించ లేదు. ఇటీవల అటువంటి దెయ్యాల కథలు, మంత్రాల కథలు వస్తున్నాయి. వచ్చాయి కూడా. సీతాదేవి మరో మట్టి మనిషి వంటి నవల రాసుకోవచ్చునని అన్నారు శ్రీ రామకృష్ణ-మరో మట్టిమనిషే ఎందుకు రాయాలి! మరో ఇతివృత్తంతో అంతకంటే ఉదాత్తమైన ఉత్తమమైన సాహిత్యపు విలువలు గల నవలలను సృష్టించగలదామె. ఈ విషయం ఒప్పుకోక తప్పదు....

పార్వతి, మిత్రులు
న్యూమలక్ పేట్, హైదరాబాద్.

**పొరబాటు**

"పొరపాటు" కథలో 66 పేజీతరువాత 76 పేజీముద్రించబడింది. కనుక అక్కడ వుండవలసిన 67 పేజీ 76 పేజీగా తరువాతి పేజీలలో పడింది. ఈ రెండు పేజీల వరుసలని గమనించి చూచుకొన ప్రార్థన. —ఇలా జరిగినందుకు చింతిస్తున్నాము. -సం.

"డబ్బు టుది పవర్ ఆఫ్ డబ్బు"

సీరియల్ నెల నెలా మమ్మల్ని సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తుతోంది. ఈ సీరియల్‌లో డబ్బు సంపాదించడానికి ఎన్ని అక్రమాలుజరుగుతున్నాయో, ఎన్ని అన్యాయాలుచేసి డబ్బు సంపాదిస్తున్నారో, డబ్బు సంపాదించడానికి మన కళ్ళ ముందే ఎన్నెన్ని మోసాలు, దగాలు, దౌర్జన్యాలు చేసి డబ్బుని సంపాదిస్తున్నారో చాలా చక్కగా చిత్రీకరిస్తూ చాలా ఆసక్తికరంగా పాఠకులకు చక్కని నవలని సీరియల్‌గా అందించిన రచయితగారికీ జ్యోతి ఎడిటర్ గారికీ అభినందనలు. ఈ సమాజంలో డబ్బున్న వాడికి డబ్బులేని వాడికి ఎన్నో తేడాలు-డబ్బుంటే చాలు-సంఘంలో పెద్ద మనిషిగా చెలామణి కావచ్చు. డబ్బుతో గౌరవం కొనుక్కొనే వాళ్ళ సంఖ్య ఎక్కువ అందుకే డబ్బు ఎంత సంపాదించావ్ అంటారే కాని ఆ డబ్బు ఏం చేసి సంపాదించావ్ అని ప్రశ్నించరు మన పెద్దలు. నీ నిజానికి చాలా తక్కువ. ఈ సీరియల్ ముగింపు ఎలా వుంటుందో తెలియదు కాని నేటి మన సమాజంలో మన కళ్ళెదురుగా డబ్బు కొరకు డబ్బు సంపాదన కొరకు ఎలాంటి విద్యలు,

గారడీలు చేస్తున్నారో చాలా చక్కగా చిత్రీకరిస్తున్నారు రచయిత.

వై. హేమసుందర్ రావు.
(డోర్నకల్)

జ్యోతి చదువుతున్న లక్షలాది పాఠకులలో నేను ఒకడిని. "ప్రతాప రవిశంకర్" గారి నవలిక "దారిలేని శారద" చాలా బాగుంది. కథలలో "వసుంధర" గారి "బొద్దింకలు" కథ నన్ను ఆకర్షించింది. దేశంలోని చీడ పురుగులను ఎలా ఏరివేయాలో చక్కటి సందేశాన్ని ఇచ్చారు.

యస్. శివానంద్.
బెల్లంపల్లి

"దారిలేని శారద"లో పాతికేళ్ళ దాటిన ఒక ఉద్యోగస్తుడు (కిరణ్), చదువుకున్న వివాహిత స్త్రీ (శారద) ఇట్లా ప్రేమా, దోమా అంటూ ఏవేవో పిచ్చి భ్రమలతో, వెర్రి ఆవేశాలతో తను జీవితాల్ని నాశనం చేసుకుంటారా అనిపిస్తుంది! కిరణ్‌కు స్థిరమైన వ్యక్తిత్వం లేదు. తాను తీసుకున్న నిర్ణయానికి తానే భయపడే పిరికివాడు, తల్లి దండ్రులను గానీ, సంఘాన్ని గానీ, ఎదిరించే శక్తి అతనిలో ఎంత మాత్రమూ లేదు. అటువంటి "పనికి మాలిన" వ్యక్తిని నమ్మి చదువూ, సంస్కారమూ, తెలివి వున్న ఏ స్త్రీ కూడా తన భర్తను వదిలేయదు. కాని శారద వదిలేసింది. శారద లాంటి స్త్రీలకు హెచ్చరిక ఈ నవల. అయితే, తప్పు తెలుసుకుని, పశ్చాత్తాపంతో కుమిలిపోయే శారదను ఆమె భర్త (రావ్) క్షమించి దగ్గరకు చేరదీస్తే ఆమెకు దారి (భవిష్యత్తు) తప్పకుండా వుంటుంది.

సత్యం.
బెల్లంపల్లి.



నరసరావుపేటలో ఇటీవల జరిగిన సాహితీ సమావేశంలో ప్రసంగిస్తున్న శ్రీ జ్వాలాముఖి.



సచిత్ర మాసపత్రిక



## భాగ్యలక్ష్మి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ

సంయుక్తంగా నిర్వహిస్తున్న

# సంక్రాంతి కథల పోటీ

**మొట్టమొదటి సారిగా తెలుగు పత్రికా ప్రపంచంలో**

**అత్యంత ఆకర్షణీయమైన పోటీ**

ఈ సంక్రాంతి కథల పోటీ బహుమతి

## మొత్తం రూ. 7500/-

JYOTI

# మా బహుమతుల వివరాలు

ప్రథమ బహుమతి : రు. **2,000**

ద్వితీయ బహుమతి : రు. **1,500**

తృతీయ బహుమతి : రు. **1,000**

పది కన్సొలేషన్ బహుమతులు : రు. **300** చొ॥

**మీ రచనలకోసం మేం ఎదురుచూసే ఆఖరుతేది డిసెంబరు 20**



## ఇక మీరు ఖచ్చితంగా పాటించాల్సిన నిబంధనలు

1. కవరుపై, రచనపై "జ్యోతి–భాగ్యలక్ష్మి ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీస్ కథల పోటీ" అని రాయాలి.
2. 10 పేజీలకు తగ్గకుండా 12 అరటావులకి మించకుండా-ఒక ప్రక్క వ్రాయాలి.
3. రిజిస్టర్ పోస్టులో వచ్చిన రచనలకే మేము బాధ్యులం.
4. పోటీ తుది నిర్ణయం సంపాదకులదే.
   ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
5. స్వంత చిరునామాతో స్టాంపులు జతపరచిన కవర్లు రచనలతో పంపాలి.
6. రచనలో తమ కలం పేర్లు ఉపయోగించినా అసలు పేరు విధిగా రాయాలి. రచన మీద కాక విడిగా కాగితంపై పేరు, చిరునామా రాయాలి.
7. బహుమతి కంగీకరింప బడని కథలు మా సాధారణ సంచికలలో ప్రచురించే హక్కు వుంది మాకు.
8. రచనలు చేరవలసిన ఆఖరు తేది డిసెంబరు 20 తారీకు.
9. ఇతివృత్తం లాటరీలకి సంబంధించినదిగా వుండ నవసరంలేదు.
10. పోటీకి జ్యోతి మాసపత్రిక, ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీస్ కార్యాలయాలలో పనిచేయు వారి రచనలు పరిశీలింప బడవు.





లేత ప్రాయం. కల్లాకపటం తెలియని వయస్సు. నేను టెన్త్ పాసయి ఇంటర్‌లో జాయిన్ అయిన రోజులు. ఇంత వరకూ ఆడపిల్లల స్కూల్లో చదివిన నేను కోఎడ్యుకేషన్ కాలేజీలో జాయిన్ అయినాను. పదహారేళ్ళ వయసు-లోకం అంతా పచ్చగా కనిపిస్తుంది ఆవయసులో హుషారు, సరదా చెప్పలేం అబ్బ! వెళ్ళిపోయిన ఆ రోజులు మాత్రం మనసులో తీయని ముద్ర వేస్తాయి. ఆ రోజుల్లో ఒరువూ. బాధ్యతలూ ఉండవు చదువుకోవడం-నిద్రపోవడం ఎంత నిశ్చింతగా ఉండేది. నేనూ, నా ఫ్రెండ్స్ ఇద్దరం ముగ్గురం కలిసి కాలేజీకి వెళ్ళే వాళ్ళం. మేం ముగ్గురం చిన్నతనం నుండి క్లాస్‌మెట్స్‌మే. జాయిన్ అయిన కొత్తలో బుద్ధిగా వుండే వాళ్ళం. హైస్కూల్ అలవాట్లు పోలేదు మూడు నాలుగు నెలలు పోయాక కొత్త పోయింది. సాధారణంగా హుషారుగా, అల్లరిగా ఉండే మేం ముగ్గురం పూర్తిగా కొత్త పోవటం వలన, సహజంగా అల్లరి వాళ్ళం అవటం వలన కాలేజీలో కూడా అల్లరి మొదలు పెట్టాం.

అందరికీ నిక్ నేమ్స్ పెట్టడం, ఏడిపించడం. (మనలో మన మాట-మా ముగ్గురికీ కలిపి కూడా పెట్టేశారు ముక్కోటి దేవతలు అని) ఎవరికీ చెప్పకండేం!

అయితే సెకండియర్ లో ఓ కొత్త అమ్మాయి వచ్చింది. వాళ్ళ నాన్నగారికి ఏదో ఊరు నుండి ఇక్కడికి ట్రాన్స్ఫర్ అయినట్టు చెప్పింది. అప్పటికి మాకు పూర్తిగా ధైర్యం వచ్చేసింది. సీనియర్స్ అయిపోయాం. ఇక మా అల్లరికి అంతు లేదు. అందులో కొత్త వాళ్ళంటే మహా సరదా. పాపం! వాళ్ళు ఏమన్నా పడతారు కదా! ఆ అమ్మాయి తెల్లగా, అందంగా, నాజూగ్గా, సుకుమారంగా ఉండేది. ఆ అమ్మాయికి వెంటనే గాజు బొమ్మ అని పేరు పెట్టేశాను నేను. ఆ అమ్మాయి చాలా పిరికిది. ఆ అలుసు చూసుకొని నేనూ నా ఫ్రెండ్స్ ఇద్దరూ అందరం కలసి మరింత ఏడిపించే వాళ్ళం-అందులో నేను మరీను.

ఆ చిలిపి వయసు అలాంటిది. అల్లరి చేయడం తప్ప మంచీ, చెడూ అనే విచక్షణా జ్ఞానం ఉండదు. లోకంలో ఉన్న ఆనందం అంతా తామే అందుకుంటున్నట్లు అనుభూతి పాల పొంగులాటి వయసు పాలు పొంగి పొయ్యిలో పడితే ఎంత ప్రమాదమో ఆ వయసులో అల్లరి కూడా అలాటిదే.

మా క్లాస్ లో శేఖర్ అనే కుర్రాడు ఉండేవాడు అతనికి "పూరి" అని పేరు పెట్టాం. (ఎందుకు పెట్టామో సరిగ్గా గుర్తు లేదుమరి) నేను ఓ ప్లాన్ వేశాను. ఆ కొత్త అమ్మాయిని ఎలా అయినా ఏడిపించాలని మా ఫ్రెండ్స్ తో ముచ్చటించాను. ముగ్గురం కలసి ఆ ప్లాన్ ని అమలు పరిచాం.

"గాజు బొమ్మ" అసలైన పేరుతో శేఖర్ కి ఓ ప్రేమలేఖ వ్రాసి, అతను బయటకు వెళ్ళినపుడు అతని నోట్స్ లో పెట్టేశాం.

ఆ మర్నాడు చూడాలి గోల. ఆ శేఖర్ అసలే బుద్ధిమంతుడు. వెళ్ళి ప్రిన్స్ పాల్ కి లెటర్ చూపించి "గాజు బొమ్మ" మీద కంప్లయింట్ ఇచ్చాడు.

"గాజు బొమ్మ" ని పిలిపించాడు ప్రిన్స్ పాల్.

నేను వ్రాయలేదని చెప్పింది, అసలే పిరికిదేమో ముందే ఏడుపులోకి దిగింది. ఏడుపు చూచి ఆమే రాసిందని చివాట్లు పెట్టడం ఆ "చెంచా" (అదేలెండి ప్రిన్స్ పాల్ కి ముద్దుగా ఆ పేరు పెట్టాం మేమే)

"కుదురుగా చదువు కోడానికి వస్తున్నారా? ఇలా అల్లర్లు చేయడానికా" అంటు అందర్నీ కలిపి ఓ సారి తిట్టేశాడు. ప్రిన్స్ పాల్, "గాజు బొమ్మ"ని సస్పెండ్ చేశాడు. ఇంక కాలేజీ అంతా పాకిపోయింది. ఒక అమ్మాయి అబ్బాయికి ప్రేమలేఖ ధైర్యమే మరి నిజంగా ఈ గొడవలన్నీ తెలిసి ఆ అమ్మాయి వాళ్ళ వాళ్ళు కాలేజీ మానిపించేశారు. కాని వచ్చిన మచ్చ పోదు కదా! ఇంట్లోవాళ్ళు, బయటివాళ్ళు ఆ అమ్మాయిని సూటి పోటి మాటలతో బాధ పెట్టేశారు ఆ బాధ భరాయించలేక ఆ అమ్మాయి ఆత్మ హత్య చేసుకుంది. ఆ అమ్మాయి చావు నాకు షాక్ ఇచ్చిందనే చెప్పాలి. కేవలం తెలిసీ తెలియని చిలిపి వయసులో చేసిన వెధవ పనికి నిండుప్రాణం బలి అయిపోయింది. అప్పుడు నాకు కలిగిన బాధ వర్ణించలేనిది. కానీ ఆ అమ్మాయి ప్రాణం తిరిగి తెప్పించలేముగా. అప్పటి నుండి ఎంతో జాగ్రత్తగా ఉండేదాన్ని మన వలన ఇతరులకి జరిగిన అన్యాయం ఒక్కోసారి ఎంత ఘోరంగా ఉంటుందో నేనే ఉదాహరణ. కల్లాకపటం తెలియని ఆ వయసులో కళ్ళెం లేని గుర్రంలా ఉంటుంటుంది కాస్త వదిలితే పరుగు పెడుతుంది. ఏ తప్పులూ చేయకుండా ఇంట్లో వాళ్ళు జాగ్రత్తగా చూసుకోవాలి. ✻

# సర్దుబాటు మాధురి

బయట కాలింగ్ బెల్ మోగింది.

ముందు గదిలో పేపరు చూస్తున్న రావు రెండు నిమిషాలు ఆగి చూశాడు భార్య వచ్చి తలుపు తీస్తుందన్నట్లు.

మళ్ళీ ఆగకుండా బెల్ మోగింది.

అతను తలుపు తీయాలని లేవబోయేలోగానే భార్య అక్కడకు చేరుకుంది... తలుపు తీశాక ఒక సుగంధ పరిమళ భరితమైన కెరటం గదినంతా నింపివేసింది.

అతడు మళ్ళా వెళ్ళి పేపర్లో తల దూర్చాడు. ఒక చెవి పక్క గది మీద వేసి వుంచాడు.

వొచ్చింది అతని కొలీగ్ మోహన్ భార్య సుధ. ఆగకుండా మాటలు వినిపిస్తున్నాయి. ఎంత చురుకైనది సుధ అనుకోకుండా వుండలేక పోయాడు.

వెళ్ళిపోతూ "వస్తాను రావుగారూ రేపు శామూ బర్త్ డే. మన పది ఫామిలీస్ కే చిన్న పార్టీ అరేంజి చేశారు. మోహన్ మీకు విడిగా ఫోన్ చేస్తారు లెండి, "డేనియల్" పోదామా?" బయట వెయిట్ చేస్తున్న డ్రయివర్ ని పిలుస్తూ వొయారంగా వెళ్ళిపోయింది.

రావు వోరకంటితో చూశాడు. వొంపు సొంపులు కన్పించేలా నడుము కిందికి చీర, పొడవాటి జడ, ముగ్గురు పిల్లలున్నా పెళ్ళికాని అమ్మాయిలా వుంది. మోహన్ అదృష్టవంతుడు.

అలా తన ఆగమనంతో రావు హృదయంలో అలజడిని రేపి నిష్క్రమించేది సుధ.

పక్కమీద దుప్పటి సవరిస్తున్న భార్యను చూశాడు రావు.

పల్చటి చీరలు ఆవిడకి పడవుట, ముతక చీరలు తప్ప ఆనవట. ఎక్కడికైనా రమ్మంటే అందరూ తననే చూస్తారని ఎంత సిగ్గో-భయమో.

యిదే సుధ అయితే జమాయించి ప్రయిజు లివ్వటం అవీ కూడ చేసి వస్తూ వుంటుంది.

బియ్యే చదివిందని అనుకుంటారా ఎవరైనా రమను చూస్తే, అప్పటికప్పుడు ఏ సినిమాకో బయలు దేరమంటే పది నిమిషాల్లో తెమలటం చేతకాదు ఆమెకు.

గదులన్నీ తాళాలు పెట్టాలి. వంటివాడ్ని పక్కవాళ్ళకు అప్పగింతలు పెట్టాలి, మున్నగా తల దువ్వి జడ వెయ్యాలి. చీరమార్చాలి యింట్లో శుభ్రమైన యిస్త్రీ చీర కట్టుకుంటే ఏమవుతుందో

సుధ వొక్కపని ముట్టుకోదు. ఏ నిముషానంటే ఆ నిముషాన యిల్లు ప్యూన్స్ కు అప్పగించేసి నిశ్చింతగా బయలు దేరుతుంది. మహారాణిలా ప్రవర్తిస్తుంది. ఆర్ట్ ఆఫ్ లివింగ్ అంటే అట్లా వుండాలి.

రావుకు భార్యమీద ఎక్కడలేని విరక్తి కలిగింది.

వయసుకు మించి కన్పిస్తుంది. నిజానికి సుధకన్న చిన్నదే వయసులో.

o o o

"మనం సుధా వాళ్ళ బాబుకి ఏం తీసికెళ్దాం"? అడిగింది రమ.

"ఏదో ఒకటి, నీ యిష్టం వచ్చింది తెచ్చుకో" అన్నాడు రావు

"అదేమిటి అలా అంటారు ఏ మిక్సీ సెట్ తెప్పించనా" అంది

"వాకు చదవగలశా వాటిని" అని విసుక్కున్నాడు.

"పోనీ ఓ డ్రెస్ తెమ్మంటారా?"

"ఏం వాడిక లేకనా" అన్నాడు.

రమ యిక రావుని సంప్రదించకనే ఒక స్టీలు ప్లేటు తెచ్చి గిఫ్ట్ పాక్ చేయించింది.

బయలుదేరేముందు "యిదేదో అట్టహాసం లాగ పట్టుచీర కట్టకపోతే వేరే ఏద. యినా కట్టుకోలేక పోయావు" అన్నాడు.



రమ కొత్తగా పరికించి చూసింది అతన్ని పార్టీలకు పట్టు చీరలు కట్టటం అలవాటే.

"ఏం యిది బాగు లేదా"? అంది.

"ఎప్పుడు చూచినా చీరలు కొన్నట్టే

పుంటావు-ఎప్పుడూ యిదే కట్టుకుని బయలు దేరుతావు"

అతని చిరాకు అర్థం కాలేదు ఆమెకు.

అంతకు ముందు ఎన్నోసార్లు దయినా కొత్త చీర ధరించినపుడు, అతనితో పది సార్లు బాగున్నదని అన్పించుకుంటే గాని ఆమెకు తృప్తి కలిగేది కాదు.

చీరల విషయం అతనికేమీ తెలియదను కునేది.

"చీరలో ఏం లేదమ్మాయీ, చీర కట్టుకున్న అమ్మాయిలో వుంది" అంటూ గిలిగిలి చేసే వాడు.

మోహన్ యింట్లో ఫంక్షను ఆరు బయట. సుధ మెలికముడి వేసుకుంది. పెద్ద పెద్దపువ్వులున్న పల్చని కెంపు రంగు చీర ధరించింది. వొకచేతికి గడియారం తప్ప ఏమీ వేసుకోలేదు.

"అయినా నిరాభరణ సుందరి లాగ చక్కగా వుంది. ఎంత అందం" అనుకుంది రమ ప్రశంసా పూర్వకంగా చూస్తూ.

తాంబూలం వల్ల ఎర్రబడిన పెదవులు— తెల్లని సుకుమారమైన దేహం.

"ఆమె ప్రతి కదలికా ఒక అందమే." అనుకుంది. రమకు సుధను చూస్తే ఎప్పుడో చిన్నప్పుడు గతించిన తన చెల్లెలు గుర్తు కొచ్చి ప్రేమ పెల్లుబుకుతుంది. అంత పర్వాటు చేసినా రవ్వంత అలసట లేదు ఆమె మొహాన. తనకిలాటివి అలవాటే నన్నట్లు ధీమాగా ప్రవర్తించింది. అదే డిపార్టుమెంటువాళ్ళు ఆడా మగా యిరవై మంది దాకా వొచ్చారు.

పిల్లవాడితో కేక్ కట్ చేయించటం- వాడికి తినిపించటం-సుధ ఒయ్యారమే ఒక ప్రత్యేకత.

చీర మీద టీ వొలకబోసుకున్న రమ మీద చికాకు పడ్డాడు రావు.

"చీర మార్చేసుకో సరిపోతుంది ఏం రమా" అని తేలిగ్గా సర్దేసింది సుధ, రావులోని ఆరాటం, అసంతృప్తి క్షణక్షణానికి అధిక మయ్యాయి. తనంత దురదృష్ట వంతుడు లేడనుకున్నాడు దేవదాసు మొహం పెట్టి. భర్తను వోరకంటితో పరికించింది రమ. అతని చికాకుకు కారణం స్పష్టాస్పష్టంగా వుంది ఆమెకు. అందరి వంకా కలయ జూసింది. ఎవరి మానాన వాళ్ళున్నారు.

జీప్ నడుపుతున్నా రావు ఆలోచనంతా సుధ మీదనే వుంది. సుధ వంటి భార్యను పొందిన మోహన్ ఎంత అదృష్టవంతుడు!

భార్యను వోరగా చూశాడు. పాపిట్లో అక్కడక్కడా మెరుస్తున్న వెంట్రుకలు ఆమెకు పర్సనాలిటి కాన్షస్‌నెస్ ఎప్పుడూ లేదు.

"చూడూ హెయిర్ డై వేసుకోరాదు" అన్నాడు అసందర్భంగా.

రమ సాలోచనగా చూసింది ఏమొ చ్చింది యిప్పుడు అన్నట్లు.

"మనిషికి ఎప్పుడూ బ్యూటీ కాన్షస్‌నెస్ వుండాలి. వొళ్ళుచూశు ఎలాగ వచ్చిందో, అన్నం తప్ప చపాతీలు ముట్టనంటావు" అన్నాడు అయిష్టంగా చూస్తూ.

రమ దృష్టి అంతా రోడ్డు మీదనే వుంచింది. మాట్లాడటానికి అసహ్యపడి, మౌనాన్ని ఆశ్రయించింది

సుధపట్ల అనవసరపు చొరవ చూపించ టం - అవసరమున్నా లేక పోయినా మాట్లాడబోవటం-గమనిస్తూనే వుంది.

యిల్లుచేరాక చాలా ముభావంగా ఎవరి పనులు వారు ముగించుకుని, పక్క మీదకు చేరుకున్నారు.

రమ పక్కకు వొత్తిగిల్లి పడుకుంటే రావు చాలా సేపు మాగన్నైన్సు తిరగేస్తూ గడిపాడు. కళ్ళు మూసుకున్నా రమ కళ్ళ

ముందు చీకటి వలయాలున్నాయి. యిద్దర్ని కలిపివుంచే అనుబంధం యింత అల్పమైనదని వొప్పుకోవటానికి ఆమె మనసు అంగీకరించటంలేదు.

"మీతో ఒక్క విషయంమాట్లాడాలి" అంది నిస్సంకోచంగా.

"ఏం మాట్లాడతావు" అన్నాడు రావు నిర్లక్ష్యంగా పేపరుతిరిగేస్తూ.

"దయచేసి కాసేపు ఆ పేపరు కట్టి పెట్టండి—నేనడిగినదానికి జవాబు యిచ్చి తీరాలి"

"ఏమిటినువ్వు అడిగేది?" అన్నాడు.

"యివ్వాళ నన్ను చాలా విషయాల్లో విమర్శించారు మీరు. ఒక్కసారిగా ఎక్కడ లేని లోపాలు నాలో కన్పించాయి మీకు. మీ పట్ల అనురాగంవల్ల మీరు కోరిన విధంగా ప్రవర్తించగలనేగాని అది నా తరహా కాదని గుర్తుంచకోండి

హెయిర్ డై వేసుకునీ; వొంపులూ సొంపులూ ప్రదర్శిస్తూ ఎప్పటికప్పుడు నిత్య నూతనంగా మిమ్మల్ని ఆకర్షిస్తూ వుండా లన్న మాట.

ఏరోజుకారోజు మనకు ఏళ్ళుపైబడు తున్నాయన్నది గుర్తుంచుకోండి. పెరిగే పిల్లల ముందు ఎలా మెలగాలన్నది మర్చి పోకండి"—ఏదో అనబోయింది.

"ఆపు నీ వుపన్యాసం. నీ అందచందాల్ని నేను విమర్శించలేదే"

"పైకి అనలేదు. మనసులో అగ్నిరాజ పెట్టు కుంటున్నారు. నాకు తెలుసు. సుధలాగ నేను లేనన్నది మీ అసంతృప్తి.

నేను సుధ లాగ వుండాలనేది మీ కోరిక

నేను రమను. రమలాగే వుంటాను. భార్యాభర్తల మధ్య అందచందాల ప్రసక్తి రావటం ఎంత దురదృష్టకరం! మనం యిష్టపడి పెళ్ళి చేసుకున్నాం, ఏ కలతలూ ఎరక్కుండా యిన్నేళ్ళు గడిపాం. కాని అది యింత స్వల్పకారణానికి చెదరిపోతుం దనీ, చిన్న చిన్న ఆకర్షణలకి మీ మనసు రెపరెపలాడ తుందనీ నేను అనుకోలేదు.

మీ భార్య అందంగా వుండాలని మీ రనుకోవటంలో తప్పులేదు.

అందానికీ ఆకర్షణకీ అంతెక్కడ ప్రసాద్

నా యిష్టాలకి వ్యతిరేకంగా మీరు రమ్మన్న చోటికల్లా వొచ్చాను. నేను కలిసి పోలేని, నాకు ఆసక్తిలేని స్నేహితులనల్లా మీ కోసం ఆదరించాను.

దీనికి అంతెక్కడ మీ కరిణ్యానికి అవధులే లేవా?" వుద్వేగంతో కంపించిపోతూ అంది.

"ఏమిటి మాటలు చాలా అంటున్నావు. ఏమన్నాను నేను యింతకీ"

రావు మాటలు పూర్తికాలేదు. రమ అందుకుంది.

"అందచందాల్ని గుర్తించేశక్తి మీలాగే నాకూవుంది. మీకు మోహన్‌లావున్నారా? చంద్రశేఖర్ స్పోర్ట్స్‌మన్. అతన్లా మీరు లేరని నేననుకుంటే మీరు సంజాయిషీ యిచ్చుకుంటారా?" రమ నిర్భయంగా అడిగింది.

రావు మొహాన కత్తివేటుకు నెత్తురు చుక్క లేదు

"రమ." అన్నాడు

"అవును మీరు అట్లా పిలిచినపుడల్లా నేను 'వూ' అని జవాబిస్తూనే వుంటాను. సర్దు బాటు నా తత్వం-అది గుర్తుంచుకోండి" అంది రమ.





తమిళనాడు ప్రభుత్వం 'తెలుగువీణ–చిట్టిబాబు'ని
ఆస్థాన వైణికునిగా నియమించారు భేష్.



వంశీ ఆర్ట్స్ మినీకవితావిష్కరణ సందర్భంలో ఎస్.పి. బాల సుబ్రమణ్యం,
శ్రీ రాజా, డా॥ సి. నారాయణరెడ్డి.

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు$^{డబ్బు}$

(గాంధీ గ్రాడ్యుయేటు. తల్లి శవాన్ని కాల్చటానికి కాటి కాపరి లంచం అడగటంతో ఈ ప్రపంచం అంతా డబ్బుచుట్టూ తిరుగుతూందని గ్రహిస్తాడు. అతడికి లక్ష్మి అనే డాషింగ్—డేరింగ్—అమ్మాయితో పరిచయం అవుతుంది. అదే సమయానికి రామ్మోహన రావు అనే ఒక కోటీశ్వరుడు ఒక చిన్న ఉద్యోగానికి ఓ వింత ప్రకటన ఇస్తాడు. ఆ ఇంటర్వ్యూకి వెళ్ళిన గాంధీ-మాట మీద మాట పెరిగి-అయిదు సంవత్సరాల్లో "చట్ట బద్ధంగా" యాభై లక్షలు సంపాదించటం కష్టం కాదని పందెంకాస్తాడు. అలా సంపాదిస్తే తన కూతురు హారికనిచ్చి పెళ్ళి చేస్తానని రామ్మోహన రావు అంటాడు. పదిపైసల పెట్టుబడితో డబ్బు సంపాదించటానికి ప్లాన్‌లు వేస్తాడు. అతడు కొద్దిగా డబ్బు సంపాదించటం చూసి, అతడిని అణిచి వేయటానికి రామ్మోహన రావు ప్రయత్నాలు చేస్తాడు. హారిక పెళ్ళి చూపులు, గాంధీ ఆకస్మిక రాకవల్ల చెడిపోతుంది. గాంధీని రామ్మోహన రావు కొడ్తాడు. గాంధీ పగబడ్తాడు. ఈ లోపులో గాంధీకి రామ్‌తీర్థ అనే అతడితో పరిచయమయి-లక్ష రూపాయలు అప్పుగా దొరుకుతుంది)

— ఇక చదవండి —

"రాష్ట్రంలో ఒక ప్రభుత్వ సంస్థవుంది. పరిశ్రమలు పెట్టటానికి - ప్రోత్సహించటానికి అది అప్పులిస్తుంది. ఆ సంస్థ నుంచి అప్పు కొంత తీసుకొని ఇండస్ట్రీ పెడ్దామనుకుంటున్నాను" అన్నాడు గాంధీ.

"పెట్టుబడి ఎవడిస్తాడు?" అంది లక్ష్మి.

"లక్షపైగా రామ్‌తీర్థ కమీషన్ రూపంలో ఇచ్చేది వుందిగా"

"అది తీసుకోను అన్నావుగా."

"నేను తీసుకోవటంలేదు – పరిశ్రమ పెట్టిస్తాను"

"ఎవరితో?"

అతడు మాట్లాడలేదు. "ఆ సంస్థని 'చట్ట బద్ధంగా' మోసం చెయ్యబోతున్నావా?" అన్నది. అతడు నవ్వి "నిన్ని అనుమాన పిశాచం వదలదా?" అన్నాడు. ఆమె 'చట్ట బద్ధంగా' అన్న పదాన్ని నొక్కి పలకటం చూసి.

"నా ప్రశ్నకి సమాధానం అది కాదు."

"లేదు. నేను ఆ సంస్థని మోసం చెయ్యబోవటంలేదు."

"చట్ట బద్ధంగా కూడా"

"ఆc! చట్ట బద్ధం – న్యాయబద్ధం - నువ్వు ఏదైనా అనుకో - నేనేవిధంగానూ ఆ సంస్థకి అన్యాయం తలపెట్టటం లేదు. అసలు నాకా ఆలోచనే లేదు. కాబట్టి నువ్వు నిస్సంశయంగా నాతో సహకరించవచ్చు."

"నీ పెర్సనల్ సెక్రటరీని కదా.... చెప్పు ఏం చెయ్యాలో...."

"ఆ సంస్థ ముఖ్యాధికారి గురించి నాకు కొంత వివరాలు కావాలి"

"మొన్న ఇచ్చినట్టుగానా?"

"ఆహాc.... అలా అక్కర్లేదు. అతడి కుటుంబ చరిత్ర, ఎక్కణ్ణుంచి వచ్చాడు వగైరా విషయాలు అక్కర్లేదు. అతడెలాంటి వాడు? ఏమిటి అతడి బలహీనతలు? దేనికి సులభంగా పడతాడు? అతడి స్నేహితులెవరు? వగైరా విషయాలన్నీ కావాలి."

"ఎంత కాలంలో...."

"ఎంత తొందరగా అయితే అంత మంచిది."



"సరే...." అంటూ ఆమె లేచింది. అయితే ఆమె అనుమానం తీరలేదు. "—లక్ష రూపాయల్తో యాభై లక్షలు ఎలా సంపాదిస్తావ్? అని అడిగింది."

"అసాధ్యం"

"మరి—"

"నేనలా సంపాదించ బోవటం లేదు."

"మోసం చెయ్యటం లేదుగా" నొక్కి అడిగింది.

"లేదు."

"మరి చెప్పవా-ప్లీజ్...." అంది. అతడు నవ్వి "....సారీ" అన్నాడు

"పెర్సనల్ సెక్రటరీకి విషయాలు వివరంగా చెప్పని బాస్ లందరూ తరువాత చిక్కుల్లో పడ్డారు."

"పర్లేదు"

ఉక్రోషంతో ఆమె మొహం ఎర్రబడింది. "సరే అయితే" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోబోయింది. "ఇంకొక్క మాట" అన్నాడు.

"ఏమిటి?" ఆగింది.

"బాస్‌లని "నువ్వు" అనకూడదు. "మీరు"-అనాలి.

ఆమె పెదాలు బిగపట్టి "అలాగే" అన్నది. అయితే అది కోపమో, నవ్వో అతనికి తెలియలేదు.

○ ○ ○ ○ ○ ○

—పది రోజుల తరువాత అతడికి రిపోర్టు వచ్చింది.

సంపత్ కుమార్....వయసు నలభై అయిదు. ఐ. ఏ. యస్. ప్యాసయ్యాడు. ఈ సంస్థకొచ్చి అయిదు సంవత్సరాలయింది. అతడొచ్చిన తరువాత సంస్థ అన్ని రంగాల్లోనూ అభివృద్ధి సాధించింది.

సంస్థ ఇచ్చే వసూలు ఋణాలు కాక పోవటం అంటూ వుండదు. ప్రభుత్వం ఈ సంస్థకి చాలా అధికారాలు ఇచ్చింది. ఆ అధికారం క్రింద సర్వ ఆస్థులూ అమ్మేయ్యొచ్చు. అయితే, ఆ అవసరం రాకుండానే అధికారులు జాగ్రత్తగా కనిపెడ్తూ వుంటారు.

సంపత్ కుమార్ చాలా డైనమిక్ మనిషి! సంస్థ కోసం చాలా పాటుపడ్తాడు, తన క్రింద అధికారులు ఏ మాత్రం నిర్లక్ష్య వైఖరి చూపించినా సహించడు. తొందర్లోనే అర్జంటైన జేపన్‌కి వెళ్ళబోతున్నాడు.

అతడికి వివాహమైంది ఇద్దరు పిల్లలు. ఒకరు డెహ్రాడూన్‌లోనూ, వేరొకరు తాతగారిదగ్గిర, కలకత్తాలో చదువు కుంటున్నారు అతడిది ప్రేమ వివాహం. భార్య పేరు ప్రియంవద, వారిది చాలా అన్యోన్యమైన దాంపత్యం మేడ్ ఫర్ ఈచ్ అదర్ పోటీలో పాల్గొంటే తప్పక బహుమతి వస్తుంది.

సంపత్‌కుమార్‌ది చాలా విచిత్రమైన మనస్తత్వం. చాలా మంది అతడిని తాగుబోతు, తిరుగుబోతు అని అనుకుంటారు. నిజానికి అతడు అలానే ప్రవర్తిస్తాడు. యంత్రమయ్యేసరికి బార్‌లోగాని, స్టార్‌హోటల్ బఫేరూమ్‌లో - నీ కనిపిస్తాడు. అయితే అతడి చేతిలో గ్లాసులో ద్రవం ఒక్కసారికన్నా తగ్గదని–ఒక పెగ్‌కన్నా ఎక్కువ తాగడని చాలా మందికి తెలీదు. అలాగే అతడు స్త్రీలోలుడన్న ప్రచారం ఒకటుంది. అది నమ్మి కొందరు పెద్ద మనుష్యులు అమ్మాయిల ద్వారా తమ పనులు చేయించుకోవాలని ప్రయత్నం చేసి ఘోరంగా విఫలమయ్యారు, మంచి ఎత్తు, అందం, పదవి ఇచ్చే దర్జా వీటన్నిటివల్లా వచ్చే భరోసాని అమ్మాయిల మీద ఉపయోగించాలనే బలహీనమైన మనస్తత్వం. ఈ రిపోర్టు అతడి బలహీనతలను కాష్ చేయటానికైతే–అతడికి స్త్రీ బలహీనత లేదనే- స్త్రీయే అతడి పట్ల బలహీన మవుతుందనీ చెప్పటం కోసం ఈ పాయింటు నొక్కి చెప్పటమైనది. అయితే అతనో ఆయ్యేయస్ ఆఫీసర్ కాబట్టి-అతడిమీద చాలా కళ్ళుంటాయి కాబట్టి అతడికి తొందరగా ఆ పేరొచ్చింది.

సంపత్‌కుమార్ సిగరెట్లు తాగడు. వక్కపొడి కూడా అలవాటు లేదు. రేసులూ పేకాటా అలాటి పిచ్చిలేదు. పైకి చాలా తేలిగ్గా, "ఈజిలీ అప్రోచ్‌బుల్" గా కనిపించినా, పరిధిదాటి ఏ పనీ చేయడు.

చాలా మంది ఐ. యే యస్ ఆఫీసర్లలాగే అతడు పబ్లిసిటీ మానేగర్. ప్రతీ చిన్న విజయాన్ని ప్రభుత్వ దృష్టికి, ప్రజలదృష్టికీ తీసుకు రావటం కోసం ప్రయత్నం చేస్తూవుంటాడు. అతడు నిజంగా కష్టపడి పనిచేసే వాడవటంతో-అది బాగా లాభించింది.

సంపత్‌కుమార్‌కి తల్లి తండ్రులు చిన్నతనం లోనే పోయేరు. అతడు స్వశక్తితోనే చదువుకొని పైకి వచ్చాడు. అందువల్ల ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఎక్కువ అయితే తగ్గించుకోవటం కోసం స్వయం కృషితో ఒక్కో అంతస్థు ఎక్కటం ప్రారంభించాడు. అయినా బహుశ అతడి రక్తంలో ఆ కాంప్లెక్సు జీర్ణించుకు పోయి ఉండటం వల్లనేమో, ముఖ్యమైన నిర్ణయాలు చేసుకొనే విషయంలో కొద్దిగా జాప్యం చేస్తూవుంటాడు. అతడి మూడ్‌ని అర్థం చేసుకోవటం కూడా కష్టమే. ఒక్కొకప్పుడు ఎంతో నవ్వుతూ హుషారుగా మాట్లాడిన వాడు-చాలా కొద్ది సమయంలోనే సీరియస్‌గా, ముభావంగా మారి పోతాడు. దీనికి కారణం బహుశా అతడిలో వస్తున్న పరివర్తన, వేదాంత ధోరణి కావచ్చు. చిన్నతనంలో పడిన కష్టాలు-ప్రస్తుతం అనుభవిస్తున్న లౌక్యపు అధునాతన ప్రపంచం అతనినీ ఆ ధోరణిలోకి మళ్ళిస్తున్నట్టూ, అతడి ఇంటిలో వున్న లైబ్రరీలో వేదాంత పుస్తకాలు తెలియ జేస్తున్నాయి అంతే కాకుండ ఈ మధ్య అతడు తన రాబడిలో కొంత మొత్తాన్ని ధర్మ సంస్థలకి ఇవ్వటం మొదలు పెట్టాడు"




ఇలా సాగింది ఆ రిపోర్టు. ఆ తరవాత అతడి భోజన నియమాలూ, మిగతా స్నేహితుల వివరాలూ (కొద్దిగా), అతడి ఆర్థిక స్థితిగతులూ వున్నాయి. గాంధీ కాగితాలు చదివి పక్కన పెడ్తూ "చాలా బావుంది నీ రిపోర్టు" అన్నాడు. అప్పటి వరకూ అతడి మొహంకేసి ఆతృతతో చూస్తున్న లక్ష్మి సంతృప్తి చెంది "థాంక్స్" అన్నది.

"నేను వూరికే అనటం లేదు, మంచి చెడులమధ్య మనిషి మానసిక విశ్లేషణ చాలా కరెక్టుగా చేసేవు...ఇంత కొద్ది సమయంలో అన్ని వివరాలు ఎలా సేకరించగలిగావు?"

ఆమె నవ్వింది. "అసిస్టెంటు బాగా పనిచేస్తే అభినందించాలి తప్ప—ఎలా చేశావ్ అని అడక్కూడదు." అంది.

"మామూలు విషయాలు సేకరించటం వేరు. ఒక మనిషి పైకి ఎలా ప్రవర్తిస్తాడు—లోపల ఎలా వుంటాడు—ఈ వివరాలు తెలుసుకోవటం వేరు...అందులోను అంత పెద్ద ఆఫీసర్ అంతరంగం గురించి...చాలా లోతుగా—....సున్నితమైన విషయాలు కూడా—"

"అతడితో స్నేహం చేసేనేమో...."

గాంధీ ఉలిక్కిపడి—

"కొంపదీసి అతడు తన ఛరిష్మా నీ మీద కూడా వుపయోగించాడా" అని అడిగాడు.

ఆమె నవ్వేసి "అవన్నీ నువ్వు అడక్కూడదు .... నేను చెప్ప కూడదు" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. అతడు రిపోర్టును మళ్ళీ చేతుల్లోకి తీసుకున్నాడు.

అతడికి రిపోర్టులో రెండు విషయాలు ముఖ్యమైనవిగా తోచాయి. మొదటిది—సంపత్ కుమార్‌కి తను చేసిన పనిని ప్రజలూ, ప్రభుత్వమూ గుర్తించాలన్న కాంక్ష వున్నది. రెండు—అతడికి వున్న ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌వల్ల ముఖ్యమైన నిర్ణయాలు తొందరగా తీసుకోడు.

అతడు పేపరు పక్కన పడేసి, దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. ఆ మరుసటిరోజు అతడు సంపత్ కుమార్‌ని కలుసుకున్నాడు.

o o o

—చాలా మందికి ఒక వుద్దేశ్యంవుంది. అధికారుల్ని ఏ బార్‌కో, క్లబ్‌కో తీసుకెళ్ళి స్నేహం చేసుకుంటే అందువల్ల పనులు తొందరగా అవుతాయని! కానీ ఇది తప్పు. అధికారులు—ముఖ్యంగా కొద్ది శాతం నిజాయితీ వున్న వాళ్ళు—కేవలం పనిమీద తమ దగ్గరకి వచ్చి, ఆ పని చూసుకొని వెళ్ళిపోయే వ్యక్తులపట్లే ఎక్కువ గౌరవం కలిగివుంటారు. వారితో 'స్నేహం' చేసుకోవటం వల్లగానీ, వారిని పార్టీకి ఆహ్వానించి పరిచయం పెంపొందించుకోవటం వల్లగానీ పనులు జరుగుతాయనుకోవటం భ్రమ

గాంధీ సంపత్ కుమార్‌ని అతడి ఆఫీసులోనే కలుసుకున్నాడు. పరిచయం అయ్యాక అతనిలా అన్నాడు.

"నిరుద్యోగులైనవాళ్ళు మొత్తం ఇరవై మంది ఇంజనీర్లున్నారు మారికి నేను ప్రొ మోటర్ కమ్ రిప్రజెంటేవ్‌ని, సర్! మేం వివిధ రకాలైన పరిశ్రమలు పెట్ట దల్చుకొన్నాం దానికి మీసంస్థనుంచి రుణ సహాయం తీసుకోవాలని అనుకుంటున్నాం."

సంపత్ కుమార్ ఉత్సాహంగా ముందుకువంగి, "ఇరవైమంది ఇంజనీర్లా...." అన్నాడు.

"ఔను సర్—అందరూ నిరుద్యోగులు."

"ఏయే పరిశ్రమలు?"

"ఆ రిపోర్టులన్నీ తయారుచేసి వుంచాం. రెండు లక్షలనుంచీ, అయిదులక్షల మధ్యలో ఒక్కొక్క పరిశ్రమకి ఖర్చవుతుంది. అందులో మీరు నూటికి ఎనభై శాతం ఇస్తారు కదా.... పదిశాతం గవర్నమెంటు ఇస్తుంది. కొంత సబ్సిడీ వస్తుంది. మిగతాది మేం పెట్టుకుంటాం."

సంపత్ కుమార్ సంతోషంగా "ఇంత మంది ఇంజనీర్లు ఇలా ముందుకొచ్చి, ఉద్యోగాలకోసం ప్రభుత్వంమీద ఆధారపడకుండా పరిశ్రమలు స్థాపించటం నాకెంతో ఆనందాన్ని ఇస్తుంది. మా సంస్థ తరఫునుంచి ఏ సాయం కావాలన్నా తప్పక ఇస్తాం. అప్లికేషన్లు పెట్టుకోండి...." అన్నాడు.

గాంధీ నవ్వాడు. అది అంత సులభంగా తేలే విషయం కాదు. అతడు అంతకు ముందు వ్రాసుకొని పెట్టుకొన్న కాగితం ఎదుటి ఆఫీసర్ వైపు తోసేడు అందులోవుంది.

స్థిరాస్తులకోసం మొత్తం పరిశ్రమ పెట్టటానికి అయ్యేఖర్చు : రూ. రెండు లక్షలు

| | | |
|---|---|---|
| సంస్థ ఇచ్చేది | : | 1.60 లక్షలు |
| సబ్సిడీ—|—ప్రభుత్వం ఇచ్చేది | : | 0.20 లక్షలు |
| పెట్టుబడి | : | 0 20 లక్షలు |
| మొత్తం | : | 2.00 లక్షలు |

సంపత్ కుమార్ తలూపి, "ఇది సరిగ్గానే వుంది." అన్నాడు.

గాంధీ నవ్వి పై లెక్క ప్రకారం మేం ఒక్కొక్కరూ ఇరవై వేలు పెట్టుబడి పెట్టాల్సి వుంటుంది. మొత్తం ఇరవై మందీ కలిస్తే నాలుగు లక్షలు అవుతుంది. కానీసర్—ఇదే సమస్యని ఇంకో కోణంలోంచి చూస్తే ఇలా వుంటుంది....




| | | | |
|---|---|---|---|
| ఖర్చు : | భూమి (అర ఎకరం) | : | 15 వేలు |
| | భవనం | : | 35 వేలు |
| | మిషనరీ | : | 150 వేలు |
| | | | 2.00 లక్షలు |

"అవును ఇదీ కరెక్ట్" అన్నాడు సంపత్ కుమార్.

"మొదట స్థలంకొని ఫ్యాక్టరీ కట్టామనుకోండి - దానికి యాభై వేలు అవుతుంది. అందులో మా పెట్టుబడి అయిదువేలు. ఇరవై మందీ కలుస్తే లక్ష.

మేం పెట్టుబడిగా పెట్టవలసిన నాలుగు లక్షల్లో ఒకలక్ష మేం పెడ్తాం. మీరు దాని మీద ఎనిమిది లక్షలు అప్పివ్వండి. మిగతా డబ్బు మేం మిషనరీ కొనేటప్పుడు ఇద్దురు గానీ...."

సంపత్‌కుమార్ కుర్చీ వెనక్కివాలి, సారీ....కుదరదు" అన్నాడు." మీ దగ్గిర పూర్తి పెట్టుబడి పెట్టటానికి సరిపోయే డబ్బు వుందో లేదో చూసుకోకుండా మేము అప్పు ఇవ్వము" అన్నాడు.

"కానీ మేం కట్టపోయే ఫాక్టరీలు మీకు హామీ వుంటాయి అదీగాక-మీరు మేం అంచెలంచెలుగా ఫాక్టరీ కడ్తున్నప్పుడే కదా—డబ్బు కూడా వాయిదాల ప్రకారం ఇస్తారు. ఇక ఇందులో రిస్క్ ఏముంది?"

"మేం మా డబ్బు ఎలా వసూలు చేసుకోవాలి? అని ఆలోచిస్తూ అప్పు ఇవ్వం. ఎలా పరిశ్రమ అభివృద్ధి చెందుతుంది అని చూస్తాం. మీరు మొత్తం నాలుగు లక్షలు పెట్టాలి. కానీ లక్ష పెడ్తాం అంటున్నారు మిగతా డబ్బు ఎక్కణ్ణుంచి తెస్తారు."

"ఇంకో ఆర్నెల్లలో మిగతా వనరులు సమకూర్చుకొని"

"అప్పుడే పెట్టొచ్చుగా"

"ఈ లోపులో కొంత వర్క్ సాగుతుంది గా...."

"సారీ"....ఇక మీరు వెళ్ళవచ్చు అన్నట్టు లేచి నిలబడ్డాడు సంపత్.

"మొత్తం కాపిటల్ చూపించటాన్ని "ఇనిషియల్ కాపిటల్ కండిషన్" అంటారు. ఆ కండిషన్ లేకుండా మేం అప్పు మంజూరు చెయ్యం."

ఇంటర్వ్యూ ముగిసింది.

ο ο ο

"పని అవలేదా" అడిగింది లక్ష్మి.

"లేదు." అన్నాడు గాంధీ. "-అతడెందుకంత భయపడుతున్నాడో నాకు అర్థం కావటం లేదు. మేమేమీ ఆ సంస్థని మోసం చెయ్యటం లేదే ..."

"అయినా నీ దగ్గిర పూర్తి డబ్బు లేకుండా ఎందుకు పరిశ్రమలు పెట్టటం" అడిగింది లక్ష్మి. గాంధీ మాట్లాడలేదు.

మళ్ళీ ఆమే-"ఇంత మంది ఇంజనీర్లు పరిశ్రమలు స్థాపించటం చాలా ప్రిస్టీజి వ్యవహారం అవుతుందని చెప్పలేకపోయావా?" అంది

"అదీ చెప్పాను కానీ నువ్వు రిపోర్టులో వ్రాసినట్టు నిర్ణయాలు తీసుకోవటంలో ఆలస్యం చేస్తాడు. అతడు మాటల్లో తెలుస్తూంది-అతనికి ఈ రుణం ఇవ్వాలని వున్నట్టూ.... కానీ తటపటాయిస్తున్నాడు."

"నాకో విషయం చెప్పు ...నువ్వు ఆ సంస్థని మోసం చెయ్యదల్చుకున్నావా? అప్పు తీసుకున్నాక??.... నిజాయితీగా చెప్పు...."

"లేదు"

"సరే అయితే సంపత్‌కుమార్ ఆ కండిషన్ తొలగించేటట్టు చేసే బాధ్యత నాకు వదిలి పెట్టు...."

అతడు విస్మయంతో, "ఎలా" అన్నాడు.

"నేను చూసుకుంటానన్నాగా.... ఆ విషయం నాకు వదలిపెట్టు"

అతడికి నమ్మశక్యం కాలేదు. "ఎలా? చెప్పవూ" అన్నాడు. ఆమె నవ్వి ఊరుకుంది. తరువాత నెలరోజులకి రుణం మంజూరు అయింది.

తరువాత పదిరోజులకి ఇంజనీర్స్ ఇండస్ట్రియల్ ఏరియా అన్న పేరక్రింద (E.I.A) వూరికి పదిహేనుమైళ్ళ దూరంలో కొండ అవతలివైపు పదెకరాలస్థలం ఇరవైమంది ఉత్సాహవంతులైన యువకులచే కొనబడింది...ఎకరం ఒకటికి ముప్ఫైవేలు చొప్పున.... మొత్తం మూడులక్షలకి....

తన దగ్గిరున్న లక్షా ఇరవై వేలలో అరవై వేలు భూమి కొనుగోలు నిమిత్తం ఖర్చుపెట్టాడుగాంధీ మిగతా డబ్బు సంస్థఇచ్చింది. ఇంజనీర్ల పేరున స్థలం రిజిస్ట్రేషన్ అవగానే పునాది మహోత్సవం మొదలైంది. మొట్ట మొదటి శంకుస్థాపన పరిశ్రమల మంత్రి చేసాడు. ఆ సాయంత్రం ఫంక్షను ఏర్పాటు చేసారు

"....మీరు ఇటువంటి పరిశ్రమలు ఇంకా స్థాపించాలి.. .ఇంజనీర్లు ఉద్యోగాల కోసం చూడకూడదు...యువకులు స్వయంశక్తి మీద ఆధారపడినప్పుడే దేశం పురోగమిస్తుంది...."వగైరా స్టాక్ డైలాగులతో మంత్రిగారి ఉపన్యాసం పూర్తయింది.

ఆ తరువాత సంపత్ కుమార్ మాట్లాడాడు. అతడు చాలా ఉత్సాహంగా వున్నాడు. నిజానికి అతడి ఆధ్వర్యంలో సంస్థ సాధించిన విజయాల్లో ఇదొకటి. మొత్తం ఇరవైమంది ఇంజనీర్లు కలిసి కోటి రూపాయల విలువచేసే పరిశ్రమలు స్థాపించటం.... అతడు చాలా సిన్సియర్‌గా-యువకుల బాధ్యత గురించి, అటువంటి యువకులకి తమ




సంస్థ ఇచ్చే సహాయం గురించీ ఇంగ్లీషులో అనర్గళంగా మాట్లాడాడు. అతడు మాట్లాడుతున్నంతసేపూ గాంధీ అతడివైపు చూస్తూనేవున్నాడు.

ఎంత ధీమాగా లివిగా-ఆప్టిమిస్టిక్‌గా మాట్లాడాడు అనుకున్నాడు. నిజమే. తనకి ఒక పదవివుండి—తనకీ తన జీవితం స్థిరంగా వుంటుంది అన్న నమ్మకం వుంటే-తనూ అలాగే ఆశావాదంతో మాట్లాడేవాడేనేమో! అతడు వెనక్కి తిరిగి చూసాడు.... ఇరవై మంది ఇంజనీర్లు .. ఏ ఒక్కరూ తక్కువ కాదు... ప్రతీ ఒక్కరూ అవకాశం వస్తే సంపత్ కుమార్‌లా జీవితంలో పైకి రాగలిగిన వాళ్ళే అతడికి రామ్‌తీర్థ మాటలు గుర్తొచ్చాయి.

అతడు ఆలోచనల్లో వుండగానే సంపత్ ఉపన్యాసం పూర్తయింది తరువాత అతడి వంతు వచ్చింది అతడెక్కువ మాట్లాడలేదు. ఫ్యాక్టరీకి వెళ్ళాలంటే కొండ చుట్టి వెళ్ళాలనీ-అలా కాకుండా ప్రభుత్వం పూనుకొని టన్నెల్ వేయించాలనీ అన్నాడు. అంతే తరువాత ముఖ్యమంత్రి మాట్లాడుతూ ఈ కోర్కె తప్పక పరిశీలిస్తామన్నారు.

ఫంక్షన్ పూర్తయింది.

మంత్రులిద్దరూ వెళ్ళిపోయారు. తరువాత ఒక్కరొక్కరే శలవు తీసుకోసాగారు. లక్ష్మి దగ్గిరకొచ్చి "ఇంకేమైనా పనివుందా" అని అడిగింది. ఆమె మొహంలో అలసట కొట్టొచ్చినట్టు కనబడ్తూంది.

"ఐయామ్ సారీ" అన్నాడు నొచ్చుకుంటూ.

"ఎందుకు?"

"నిన్ను చాలా కష్టపెట్టినట్టున్నాను......." అన్నాడు ఆమె మొహంలోకి ఆప్యాయంగా చూస్తూ. నిజానికి ఆమెలో డ్రైవింగ్ ఫోర్స్ వుందని అతడికి ఆరోజే తెలిసింది. అతడు మంత్రుల ఆహ్వాన కార్యక్రమంలో నిమగ్నమై వుండగా, ఆమె ఆరోజు కార్యక్రమ నిర్వహణ అంతా భుజాల మీద వేసుకుంది. స్టేజీ కట్టటం నుంచీ, మైకు ఏర్పాటు వరకూ స్వయంగా చేయించింది. పొద్దుటి నుంచి ఆమె పడిన అలసట అంతా అతడి స్నేహపురస్సరమైన ఒక్క అభినందనతో పోయింది.

"మనం తొందరగా ఇంటికి పోదాం. నాకు విపరీతమైన నిద్రొస్తూంది" అన్నది.

"నాకూ అలానే వుంది. వెళ్దాం" అన్నాడు. రాత్రి ఎనిమిదింటికే చలి మొదలైంది. అందులోనూ వూరిబైట.... మైకువాడూ, లైట్లవాడు హడావుడిగా వున్నారు. వాళ్ళు కదలబోతూంటే-వెనుక నుంచి ఒక కంఠం తియ్యగా, నాజుగ్గా వినిపించింది"...."కంగ్రాచ్యులేషన్స్" అని. గాంధీ తత్తరపడి వెనుతిరిగాడు.

హారిక!

నవ్వుతూ మళ్ళీ అదేమాట అన్నది. అతడు అప్రయత్నంగా "థాంక్స్" అన్నాడు. అతడు ఆమెని అక్కడ ఆశణం వూహించలేదు. ఆమె రావటం-తన విజయాన్ని చూడటం-సంతోషం వేసిందికూడా. అతడు లక్ష్మివైపు తిరిగి, "ఈమె హారిక-రామ్మోహన రావు గారి అమ్మాయి" అన్నాడు.

"నమస్తే" అంటూ లక్ష్మి చేతులు జోడించి హారికవైపు పరీక్షగా చూసింది.

కడిగిన మంచి ముత్యంలా వుంది హారిక. పాల నురుగులాటి తెల్లటిచీరె, పైన కప్పుకున్న పచ్చటి ఉలెన్ షాల్ కున్న నల్లటి బోర్డరు మీద వెన్నెల మెరుస్తూంది. ఆమెరుపు ఆమె కళ్ళలోనే వుంది.

"ఇద్దరు మినిష్టర్లని ఫంక్షన్ కి తెప్పించగలిగేరే" అంది హారిక. గాంధీ నవ్వి వూరుకున్నాడు. మళ్ళీ ఆమే అన్నది-"ఇలాంటి ఫంక్షన్స్ కి ఎంత మంది ప్రముఖులు వస్తే అంత మంచిది ...బాగా పబ్లిసిటీ వస్తుంది.

"అంతేకాదు-తరువాత వెళ్ళి మన పనులు చేయించుకోవచ్చు." గాంధీ అన్నాడు. లక్ష్మి ఇద్దరి సంభాషణా మౌనంగా వింటూంది.

"మీరు నాకు చెప్పి వుంటే ఇంకో ఇద్దరు మంత్రుల్ని కూడా రమ్మని పిల్చే దాన్ని" అంది హారిక. మంత్రులకి ఇంకేం పనిలేనట్టూ, కేవలం ఈ ఫంక్షన్స్ కి రావటమే పని అయినట్టూ.

"ఏ మంత్రులు"

ప్రకాశరావుగారు మా నాన్నగారికి బాగా తెలుసు. నాగభూషణరావైతే నాకే తెలుసు...."

గాంధీ ఉలిక్కిపడ్డాడు.

నాగభూషణరావు!

ఉద్వేగాన్ని అణుచుకొంటూ "మీకు అతడు బాగా తెలుసా?" అని అడిగాడు. తెలుసంది ఆమె. ఇంకా వివరాలు అడగాలని అతని మనసు తహ తహ లాడ్తూంది. కానీ అందరూ వున్నారని అతి కష్టంమీద అణుచుకున్నాడు. అతడి ఉద్దేశాన్ని గ్రహించినట్టు ఆమె "రండి కార్లో వెళ్దాం" అంది. గాంధీ లక్ష్మివైపు చూసి "పద" అన్నాడు.

"వద్దు వాన్లో వెళ్దాం" అన్నది లక్ష్మి.

"నేనూ వూళ్ళోకే-" అంది హారిక. "రండి... మిమ్మల్ని దింపేసి వెళ్తాను."

పొడవాటి చవర్లెట్ కారు వెన్నెల్లో అందగా మెరుస్తూంది. ఆమె దానివైపో క్షణంపాటు చూసి, దృష్టి మరల్చుకొని, "ఇంకా కొద్దిగా పని వుంది మీరు వెళ్ళండి, నాకు వాన్ వుందిగా" అని. గాంధీ మాట్లాడక పోయేసరికి, "వెళ్ళు-నేనిక్కడ చూసుకుంటాలే" అంది.

హారిక మళ్ళీ ఇంకొక సారి "రండి" అనే సరికి గాంధీ కదిలేడు. అతడికి నాగభూషణం గురించి తెలుసుకోవాలని చాలా ఆత్రంగా వుంది.

ఇద్దరూ ఎక్కగానే చిన్న శబ్దంతో కారు కదిలింది. అది ముందుకు పోతూంటే

దుమ్ము పైకి లేచిందీ.
తరువాత తెరలా వచ్చి అది ఆమె మొహం మీద పడింది.

ఆమె అలాగే నిలబడి వుంది. నిశ్చలంగా....

o o o

అదే సమయానికి....

రామ్మోహనరావు తన ఆఫీసు ఛాంబర్‌లో కూర్చొని రావల్సిన వ్యక్తి కోసం చూస్తున్నాడు. ఎనిమిదిన్నరయింది.

ఎయిర్ కండిషనర్ లోంచి వచ్చేగాలి ప్యూరిఫయర్ ద్వారా వయలింది ఆ గది నంతా సువాసనతో నింపుతూంది. గడియారం టిక్‌టిక్ మన్న చప్పుడు కూడా ఆ నిశ్శబ్దంలో స్పష్టంగా వినిపిస్తోంది.

అయిదు నిమిషాలు నడిచాక గది తలుపు తెరుచుకొంది. రామ్మోహనరావు తలెత్తి చూసాడు. సెక్రటరీ లోపలికి వచ్చాడు.

"ఎలా జరిగింది ఫంక్షను?"

"బాగానే జరిగింది సర్" అన్నాడు సెక్రటరీ-కానీ తన యజమాని తన దగ్గిర్నుంచి ఇంకా వివరాలు ఆశిస్తున్నాడని గ్రహించాడు. 'కూర్చో' అని ఆయన అనగానే కూర్చొని, చెప్పటం మొదలు పెట్టాడు.

"దాదాపు నలభైలక్షల రూపాయల ప్రాజెక్టు-ఇరవైమంది ఇంజనీర్లు కలిసి పెడ్తున్న ఈ పరిశ్రమల వెనుక అదృశ్య హస్తం గాంధీదే అని నిశ్చయంగా తెలుస్తూంది. ఇందులో ఈ ఇంజనీర్ల పెట్టుబడి దాదాపు పదిలక్షలు—వర్కింగ్ కాపిటల్‌తో కలిసి—పెట్టవలసివుంటుంది. అంత డబ్బు వారివద్ద లేదన్నది నిర్వివాదాంశం. మరి ఈ పథకం ఏమిటన్నది మనం ఆలోచించాలి....

....గాంధీ అప్పు ఇవ్వటానికి సిద్ధ పడిన సంస్థని మోసం చెయ్యగలడని నేను అనుకోవటంలేదు. ఎందుకంటే స్థిరమైన హామీలమీదే ఆ సంస్థ అప్పులిచ్చింది....

....స్థలం కొనుగోలు జరిగిపోయింది. గాంధీ వాళ్ళు తమ పెట్టుబడిక్రింద అరవై వేలు జమ కట్టారట. సంస్థ రెండు లక్షల నలభైవేలు ఇచ్చింది. మూడు లక్షలుపెట్టి స్థలం కొన్నారు. ఇంకోపది రోజుల్లో భవననిర్మాణం మొదలవుతుందట. అయితే ఏ వుద్దేశ్యంతో గాంధీ ఇదంతా చేస్తున్నాడో—ఎలా ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి చేద్దామను కొంటున్నాడో అర్థంకావటంలేదు. మోసం చెయ్యబోవటం లేదనేది మాత్రం నిర్వివాదాంశం"

ఇంగ్లీషులో పాఠం అప్ప చెప్పినట్టుచెప్పి, మౌనం వహించాడు. గదిలో ఒక్కసారిగా నిశ్శబ్దం వ్యాపించింది, కొంచె సేపు ఆలోచనలోవుండి, రామ్మోహనరావు కదిలి "సరే—నువెళ్ళు" అన్నాడు. అతడు వెళ్ళి పోయాక మళ్ళీ ఆలోచనలోపడ్డాడు.

—గాంధీ మోసం చెయ్యడనేది తనకూ తెలుసు. ఎందుకంటే అలాచేసిన మరుక్షణం అతడు "చట్ట బద్ధంగా" అన్న పరిధిలోంచి బైటకొచ్చి,— పందెం ఓడి పోతాడు. అసలు తను తప్పు చేసాడు. పాము చిన్నగా వున్నప్పుడే పెద్దకర్రతో కొట్టవలసింది. చిన్నదిలే అని నిర్లక్ష్యంగా వున్నాడు-ఇప్పుడు నెమ్మదిగా కదుల్తోంది.

—అయినా పర్లేదు ఇంకా పాకటం చేత కాలేదు. మళ్ళీ లేవకుండా నడుము విరక్కొట్టెయ్యాలి. కుర్చీలోంచి లేచి కిటికీ దగ్గిర నిలబడి ఒకక్షణం ఆలోచించి—ఆ గదిలోంచి బైటకి నడిచాడు. (సశేషం)

# మబ్బుల్లా మిలాగ తీరింది

నటరాజ్ ముక్కామల

"హలో" స్టాఫ్ రూమ్‌లో అడుగు పెడుతూ శ్రీదేవిని నవ్వుతూ పలకరించాడు శ్రీనివాస్ తప్పు చేసినట్లు తలొంచుకుని కూర్చున్న శ్రీదేవి అతనివైపు చూడలేక పోతూంది.

"ఏం అలావున్నారు?"

అతి ప్రయాసతో తనలోని ధైర్యాన్నంతా కూడ తీసుకుంటూ అతని వైపు చూస్తూన్న ఆమె కళ్ళలో.......ప్రపంచం అంతమవబోయేందుకు మరో క్షణ కాలపు వ్యవధి మాత్రమే నన్నట్లున్న ఆవేదన!

"మీ రెండోయేటి సైన్స్ కోతుల్తో ఈ పిరిడ్ గడిపే ఉద్దేశ్యం లేనట్లుగా వుంది మీకు!...." ఎంత సీరియస్‌గా ఉన్నవాళ్ళనైనా నవ్వించగల తన సామర్ధ్యాన్ని మరోసారి పరీక్షించుకోవాలనుకుంటూన్నట్లు తన అనుభవాన్ని వినియోగిస్తూ వాతావరణాన్ని తేలిక పరచటానికి ప్రయత్నించాడు శ్రీనివాస్.

శ్రీదేవి అదేదీ పట్టించుకునే పరిస్థితిలో లేదు. అతని హాస్యం ఆమెను నవ్వించలేక పోతూంది.

"మీరీవేళ ఆడిటోరియం గోడలను చూశారా?" సైక్లాబ్ అక్కడే పడ్డట్లు వణుకుతున్నాయామె మాటలు.

ఆ ఆడిటోరియం కట్టినప్పట్నుంచి విద్యార్థి సంఘాల ఎన్నికల ప్రచారానికి ఎంతగానో ఉపయోగపడుతూన్న దాని గోడలను తను రోజూ చూస్తూనేవున్నా.... ఆవేళ తను వాటివంక అంత పరీక్షగా చూసి వుండకపోవటం ఆమెనలా ఎందుకంతగా బాధిస్తూందో తనకు అర్థం కావటం లేదని మాత్రం అతని చూపులే స్పష్టం చేస్తూన్నాయి.

"ఈ కాలేజ్‌లో ప్రేమ పాఠాలూ నేర్పుతారట! ..."

"అని ఎవరన్నారు?" అయోమయంగా అడిగాడు శ్రీనివాస్.

"ఇక్కడి విద్యార్థులు!...." ఆమె నోటి నుంచి అంతకన్నా మాటలు పెగల్లేక పోతూన్నాయి.

అంతకు మించిన వివరణ అవసరం లేదన్నట్లుగా, చేతిలోని పుస్తకాల్ని బల్ల మీద పెడుతూ వేగంగా బైటకు నడిచాడు శ్రీనివాస్

తాటికాయలను చిన్న బుచ్చేంత అక్షరాలతో రాస్తేనే అందరికీ తేలిగ్గా కనుపిస్తుంది రాసిందేదైనా!....

"ఈ కళాశాలలో ప్రేమ పాఠాలూ నేర్పుతారు!....

కనుల పండుగచేసే దృశ్యకావ్యం.... వీనుల విందైన శ్రవ్య కావ్యం!....

శ్రీదేవీ శ్రీనివాసుల రసమయ మధుభరిత ప్రణయ చరితం! ...

కని....కనీసం విని తరించండి!....

తెలుగు లిటరేచర్ విద్యార్థుల భాషా పరిజ్ఞానాన్ని ఇక అపైన అర్థం చేసుకోగలిగేంత పాండిత్యం తన లాంటి ఇంగ్లీష్ లెక్చరర్‌కు లేదన్నట్లు మెల్లగా వెనక్కు తిరిగాడు శ్రీనివాస్.

"ఇంటర్నల్ ఎసెస్‌మెంట్ కోసం జరిపే ఆ మాత్రం బోడిపరీక్షల్లో మార్కులు సంపాదించటానికి పుస్తకాలనూ ముట్టుకోవాలాన్న ధీమాను హిమాలయాలంత

ఎత్తుగా పెంచుకున్న హీరోలు.......వాళ్ళ నిరాశనూ, కోపాన్ని తన మీద వంటరిగా తీర్చుకుంటే కానీ తీరదన్న ఆవేశంతో... అమాయకు రాలైన శ్రీదేవిని తనతో చాటుగా గోడల మీదకు [illegible]ంచటం ఎంత వరకూ భావ్యం? .."

చదివాక తనవంకే సూటిగా చూసే ధైర్యం లేక....... సిగ్గుతో కుంచించుకు పోతూన్న శ్రీదేవి....అరవై మంది కుర్రాళ్ళ ఎదుట ధైర్యంగా నిలబడి "రొమాంటిసిజమ్" మీద లెక్చర్ ఇవ్వటమనేది అసంభవం,! అలా [illegible], దాన్ని ప్రపంచపు వింతల



స్టాఫ్‌రూమ్‌కు తిరిగొచ్చే సరికి అతనికి అక్కడ శ్రీదేవి కనిపించలేదు. క్లాస్ తీసు కోటానికి వెళ్లుండదని అతనికి తెలుసు. ఇద్దరి మధ్యా రెండేళ్ళ పరిచయం ఉన్నప్పటికీ.. ఆ గోడల మీది రాతల్లోని నిజం ఎంత నమ్మ దగిందో ఇద్దరికీ తెలిసినా, వాటిని జాబితాలో చేర్చినా అతను నమ్మడు.

పుట్టుకతోటే వచ్చే సిగ్గు ఆడపిల్లకు ఆభరణాలకన్నా ఎక్కువ అందాన్నిచ్చినా "ఇంత బిడియపడే ఈ సుకుమారి పది హేడేళ్ళ చదువును ఎలాగో పూర్తి చేసినా మగ పిల్లల కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం

చేయటానికి ఎలా సిద్ధపడగలిగిందో" నన్న ఆశ్చర్యం శ్రీనివాస్‌కు మొదట్లో కలిగినా తన కలుపుగోలు తనంతో ఆ పరిచయాన్ని స్నేహంగా మార్చ గలిగాడు. కాలేజ్‌లో ఇంగ్లీష్ లెక్చరర్స్ వాళ్ళిద్దరే కాబట్టి, రోజూ కనీసం మూడు గంటల సేపైనా ఇద్దరూ కలసి ఓ గది నాలుగు గోడల మధ్యా గడపక తప్పదు కాబట్టి....అతని ప్రయత్నంతో శ్రీదేవి సహకరించక తప్ప లేదు.

కుర్రతనపు మగ కోరికలు ఎన్నో విషయాల్లో ఒకటిగానే కనిపించినా మనస్తత్వాలు మాత్రం నక్షత్రాల సంఖ్యను మించినన్ని రకాలు! గల గల పారే సెలయేటి ప్రవాహాన్నీ, మధుర సంగీతాన్నీ మైమరపిస్తూ మాట్లాడే కొంటె కోణంగులను తమ హృదయ సామ్రాజ్యపు మహారాణులుగా ఎన్ను కోవాలనుకునే.... చురుకు తనం ఎక్కువగా లేని యువకులు కొందరైతే, సాగర గంభీరతకు ప్రతీకలమనిపిస్తూ మౌనాన్ని అలంకరించుకున్న కుందనపు బొమ్మలు తమ జీవిత భాగస్వామినులుకావాలని కోరుకునే కొందరు... ఎప్పుడూ సరదాగా వుండే శ్రీనివాస్ లాంటివాళ్ళు!

శ్రీదేవి తన జీవిత భాగస్వామిని కావాలని కలలు కనకపోతుండక పోయినా, ఆమె ఎదురుగాలేని సమయాల్లో శ్రీనివాస్‌కు ఏదో వెలితిగా అనిపిస్తూంది రాను రాను. ఆ భావన రోజు రోజుకూ మరింత భరింపరానిదిగా మారుతూంది. తన మనసులోని మాటను బైట పెట్టే అవకాశం ఆమె తనకు కల్పిస్తుందేమోనని చాలా నెలలుగా ఎదురు చూస్తూన్నాడు. తన అభిప్రాయాన్ని పరోక్షంగానైనా వెలిబుచ్చేందుకు అనువైన సమయమని ఎప్పుడైనా అనిపిస్తే....అతనేం చెప్పబోతుందీ తనకు ముందే తెలిసినట్లుగా, అది వినటం తనకు ఇష్టంలేనట్లుగా....ఆమె తలనొప్పి లాంటిదేదో ఆ వాతావరణాన్ని మరుక్షణంలో మార్చేస్తుంది.

నిజానికి శ్రీనివాస్ మాట్లాడే తీరు శ్రీదేవికి ఇష్టంలేక కాదు. ప్రేమించే హృదయం, కలలు కనే కళ్ళూ ఆమె అందంతో పోటీ పడతాయి. విసుగనేది ఊహకైనా రానీకుండా అతనలా సరదాగా కబుర్లు చెబుతూంటే విరామం లేకుండా వినాలనిపిస్తూంటుంది. అతను ఇంకా ఇంకా....ఏవేవో........మరెన్నో మాటలు చెప్తూవుంటే ఎంతో హాయిగా ఉంటుందనిపిస్తుంటుంది. కానీ ఆ కోర్కె బైట పెట్టలేని సిగ్గు తనను ఆవరించిన మరుక్షణం ఆమె మొగ్గలా ముడుచుకుపోతూ, ఆ బలహీనతలు దూరం చేసుకోలేని తన నిస్సహాయతకు బాధ పడుతుంది.

శెలవు చీటి ప్రిన్సిపాల్‌కు పంపించి ఇంటికి వెళుతూ....ఆ గోడల మీద రాతలు నిజమైతే ఎంత బాగుంటుందోనన్న తన చిలిపి ఊహను హృదయంలో పదిలంగా దాచుకుంది శ్రీదేవి. ఇకనుంచీ తన సిగ్గూ బిడియాన్ని ప్రేమించకుండా, వాటిని తన నుండి పారద్రోలాలను కుంది. మరుక్షణమే ఆ సమయంలో శ్రీనివాస్ తనకు ఎదురైతే తనా పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలన్న ఆలోచనకు సిగ్గు పడింది మళ్ళీ.

ఆ మర్నాడు శ్రీదేవి కాలేజ్‌కి రాకపోవటం శ్రీనివాస్‌ను కలవర పరిచింది. ఎన్నిరోజులు శెలవు తీసుకుందో తెలుసుకుందామని ఆఫీసుకు వెళ్ళి అడిగాడు. సూపరింటెండెంట్ ముసి ముసి నవ్వులు, క్యాషియర్—టైపిస్ట్‌ల గుస గుసలూ చూస్తూంటే చిరాకు కలిగింది. జవాబు కోసం ఎదురు చూడ కుండానే ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళిపోయాడు సరాసరి.

"హలో మిస్టర్ శ్రీనివాస్! కూర్చోండి...." చూస్తూన్న ఫైల్ నుంచి చూపును మరలిస్తూ ఆప్యాయంగా తన ఎదుటి కుర్చీని చూపించాడాయన.







"ఈ పుకారును మీరూ నమ్ముతూన్నారా సర్" కూర్చుంటూ అడిగాడు శ్రీనివాస్.

"అది నిజమేనని మీ ఇద్దర్లో ఎవరు చెప్పినా తప్పకుండా నమ్ముతాను!" నవ్వుతూ కళ్ళజోడు సవరించుకున్నాడు ప్రిన్సిపాల్.

ఉన్నతమైన ఆదర్శాలు కల ప్రిన్సిపాల్‌గానే కాక మార్గదర్శిగా కూడా పేరు ప్రతిష్టలు సంపాదించుకున్న ఆయన విశాల హృదయపు మంచితనం గురించి స్టాఫ్ మెంబర్స్‌తో బాటు విద్యార్థులూ ఏదో ఓ సమయంలో తమ అనుభవ పూర్వకంగా తెలుసుకున్నవారే.

"మమ్మల్ని ఇప్పుడేం చెయ్యమంటారు?" ఆయన సలహాను అర్థించాడు శ్రీనివాస్.

"ఓసారి ఇలాగే జరిగిందో కాలేజ్‌లో, ఓ సరైన కారణమంటూ ఏదీ లేకుండానే కొందరు కొంటె కుర్రాళ్లు సరదాకు రాసిన రాతల్ని చదివిన ఆ లెక్చరర్స్ ఇద్దరూ నిజంగానే ఒకర్నొకరు ప్రేమించుకుని, భార్యా భర్తలై....ఆ కుర్రాళ్ళ రోగం కుదిర్చామను కుంటూ హాయిగా హానీ-మూన్‌కు వెళ్ళిపోయారు." తన మాటలకు రియాక్షన్ ఎలా వుంటుందోనని అతనివంక పరీక్షగా చూశాడు ప్రిన్సిపాల్.

ఉలిక్కిపడ్డ శ్రీనివాస్ కొంతసేపటికి తేరుకుని కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ,

"సర్! మీదగ్గర నేనేమీ దాచలేను!.... నేను శ్రీదేవిని ప్రేమిస్తున్నాను...." అని తలొంచుకున్నాడు.

"ప్రేమించటం చేయరాని తప్పయితే తలొంచుకోవాలి మిస్టర్ శ్రీనివాస్!...."

తన అసంకల్పిత చర్యకు సిగ్గుపడుతూ,

"కానీ ఆమె అభిప్రాయం...." అంటూ నసిగాడు శ్రీనివాస్.

"అఫ్‌కోర్స్!....పెళ్ళంటే ఆడామగా ఇద్దరూ ఇన్‌వాల్వ్ అవ్వాలి మరి!" అంటూ నవ్వాడాయన.

"థ్యాంక్యూ సర్!...." ఒక దృఢ నిశ్చయానికి వొచ్చినట్లుగా కుర్చీలోనుంచి లేచాడతను.

"బెస్టాఫ్ లక్!" ఆకథ మలుపు తనకు తెలిసినట్లుగా అన్నాడు ప్రిన్సిపాల్.

# ఉదయం

చీకటి పొలంలో
ఆశల నారు నాటుతున్నాం
నా అశ్రు వర్షంలో తడిసిన
ఈ పైరు రాత్రి గడిచే సరికి
వెండి ఉదయాన్ని పండిస్తుందని
పతీక్షణం ! ప్రతీక్షణం !!

పావని

---

అంతకు క్రితం నాలుగైదు సార్లు శ్రీదేవి ఇంటికి వెళ్ళటం వల్ల వాళ్ళింట్లో అందరూ అతనికి పరిచయమే అయినా, ఇప్పుడు అక్కడికి వెళ్ళటానికి ఓ క్షణం సందేహించాడు శ్రీనివాస్.

కానీ ఆమెను కలుసుకుని మాట్లాడటానికి మరో మార్గం కనిపించలేదు.

ఆమె ఇల్లు దగ్గరవుతూన్నకొద్దీ అతని గుండె మరింత వేగంగా కొట్టుకోసాగింది. ఎదురుగా శ్రీదేవే గుమ్మంలో కనిపిస్తే ఆ గుండె ఆగిపోతుందేమోనన్న భయంతో ఇంటిని సమీపించాడు శ్రీనివాస్

ముందు గదిలో కూర్చుని ఏదో పత్రిక తిరగేస్తూంది శ్రీదేవి చెల్లెలు. అతన్నిచూసి లేస్తూ,

"రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది వాణి

"శ్రీదేవిగారు లేరా?" గుమ్మం బైటే నిలబడి మెల్లగా అడిగాడు శ్రీనివాస్.

"లోపలుంది... పిలుస్తాను. మీరు కూర్చోండి" అంటూ అతనికి కుర్చీ చూపించి "అక్కా...." అంటూ లోపలికి వెళ్ళింది వాణి.

"ఈ సంగతి వీళ్ళింట్లో ఇంకా తెలీదేమో" శ్రీదేవితో సంభాషణ ఎలా మొదలుపెట్టాలో ఊహించుకుంటూ కూర్చున్నాడు శ్రీనివాస్.

"తనను అపార్థం చేసుకుంటే?...."

"నమస్తే!" శ్రీదేవి రాక అతని ఆలోచనలకు అంతరాయం కలిగించింది.

"నిన్న మీకు చెప్పకుండా అలా వొచ్చేసినందుకు క్షమించండి." అంటూ అతని ఎదురుగా కుర్చీలో కూర్చుంది

ఇద్దరి మధ్యా మౌనం చోటు చేసుకుంది కాసేపు. ఎవరికి వాళ్ళు తమ మనసులోని మాటను ఎలా బైట పెట్టాలని సందేహిస్తూ ఒకరి మొహంలోకి మరొకరు చూడటానికి సిగ్గు పడుతున్నారు.

"మధ్యాహ్నం ప్రిన్సిపాల్ గారిని కలిశాను..."

"మీకూ తన కథ చెప్పారా?" తలొంచుకుని మెల్లగా అడిగింది శ్రీదేవి.

"మీకెలా తెలుసాకథ గురించి?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనివాస్.

"నిజానికి అది కథకాదు. నిజ జీవితానికి సంబంధించిన సంఘటన! నిన్న సాయంత్రం ఆయన మాయింటికొచ్చారు. ఆయన పెళ్ళి ఎలా జరిగిందీ చెప్తూంటే మొదట్లో నమ్మలేకపోయాను?..." పెళ్ళి కూతురిలా సిగ్గుపడుతూ అంది శ్రీదేవి.

శ్రీనివాస్ నిశ్చేష్టుడై చూస్తూ...ఆయన శ్రీదేవి దగ్గరకు స్వయంగా వొచ్చి ఏం మాట్లాడిందీ ఊహించుకుంటున్నాడు.

రెండు కప్పుల్లో టీ తీసుకొచ్చి ఇద్దరికీ ఇచ్చి వెళ్ళిపోయింది వాణి.

"ఐలవ్‌యూ!...." శ్రీదేవి చేతిలో టీ కప్పు వణుకుతూంది.

ఆశ్చర్యంతో...ఆనందంతో శ్రీనివాస్ ఆమె వైపు చూశాడు.

చూపులతో బాటు ఇద్దరి మనసులూ ఒకటైనాయి!

లోపలి రేడియోలో నుంచి దిగ్గరగా వినిపిస్తూన్న సినిమా పాట... తమ కాలేజీ విద్యార్థుల్ని గుర్తు చేస్తూంటే ఇద్దరూ హాయిగా నవ్వుతూ ఉండిపోయారు! ✱

# అడవిమల్లె

కొసాల నాగభూషణం

"ఆశ్చర్యంగా వుంది సుశీల నీకు వుత్తరం రాసిన సంగతి తల్చుకుంటే...."

"ఏం? ఎందుకని?"

"అంత ముభావం మనిషి కనీసం పలకరించేది కాదు—తెలిసిన వాళ్లెదురైనా"

"నీకెల్లా తెలుసు ఆమెని గురించి—నాకు తెలియక?"

"దగ్గరే వాళ్ళ వూరు మా వూరికి. అయినా వివరాలేం తెలియవు ఇక మీదే నుక్కోవాలి నీకోసం" అంటూనే వున్నాడు వాడు—మా ఫ్రెండ్ సుబ్బారావు—అప్పుడే హారన్ ఇస్తూ దూసుకు రాసాగింది ఎక్స్‌ప్రెస్ బస్సు.

ఒక మోస్తరు పల్లెటూరే అయినా మెయిన్ రోడ్డులోనే వుండడంవల్ల చెయ్యి చాపితే చాలు ఆగుతాయి ఎక్స్‌ప్రెస్ బస్లు మా వూళ్లో. ప్రయాణాల కష్టే ఇబ్బంది పడక్కర్లేదు మేము.

బస్సు ఆగింది మావాడికోసమే అన్నట్టు. క్షణాల్లో వురకేసు వీడు కదిలింది బస్సు. మెరుపులా దూసుకుని వెళ్ళింది.

సుబ్బారావు నాలుగేళ్ల కాలేజీ జీవితాన్నీ ఖర్చుచేసి నేను సంపాయించుకున్న మంచిమిత్రులు నలుగురైదుగురిలో ఒకడు. నా కత్యంత సన్నిహితుడు.

వాడికి పెళ్ళికాకముందెప్పుడో వొచ్చేడు మా ఇంటికి ఆపైన పెళ్ళయి ఒక బిడ్డకి తండ్రికూడా అయ్యేడుగాని ఆ మధ్యలో మా ఇంటి కెప్పుడూ రాలేదు వాడు. సతీ సమేతంగా వొచ్చి మా ఇంటిని పావనం చెయ్యరా బాబూ! అని ఎన్నిమార్లు చెప్పినా, వుత్తరాలు రాసినా "ఏది క్షణం తీరిక.లేదు. అయినా సంసారి బాధలు నీకేం తెలుస్తాయి—సన్యాసి వెధవ్వి" అనేవాడు.

ఇప్పుడు ఏదో బిజినెస్ పనిమీద మద్రాసు వెళుతూ నన్ను చూసి చాలా రోజులే అయిందనే చెడ్డ జ్ఞాపకం ఒకటి ఏడ్చినందు వల్ల దిగేడుట ఇక్కడ నిన్న. మరి ఈ వుదయానికల్లా వుచ్చులు వూడదీసుకుని వురికేసేడు.

అయితేనేం? ప్రత్యేకం నా కోసం అని బయలు దేరకున్నా, గమ్యానికి మార్గ మధ్యంలోనే నన్ను కలుసుకున్నా "ఆప్త మిత్రుడు నాకు కనిపించేడు"అన్న తృప్తిని మిగిల్చేడు. నిన్నటి రాక. ఇవాళిటి పోక. ఈ మధ్యకాలంలో మా అనుభవం ఓ జీవితం బస్....జీవితమే ఒక నాటక రంగం! అయితే ఈ నాటకంలో సుశీల ప్రవేశించి నాకు పరిచయం కావడం ఒక అద్భుతం!

సుశీల-అసలావిణ్ణి తల్చుకుంటేనే మనసు అదో రకమైన అందోళనకి గురవుతుంది. నిర్దాక్షిణ్యంగా ఒక స్త్రీ అభిమతాన్ని నిరా

కరించ వలసొచ్చిందే అనే బాధా కలుగుతుంది. కేవలం ఒక ఆడది అని కాదుగాని ఆ మాటకొస్తే నా మూలంగా ఎవరు ఏ రకంగా బాధపడుతున్నారన్నా-ఆ బాధకి ఏమాత్రం నేను కారకుణ్ని కాకున్నా-ఎంతో బాధపడిపోతాను నేను. నిజానికి అదీ ఓ మానసిక బలహీనతే అయినా నాలో నాతోబాటు ఎదుగుతూ వొచ్చిన ఆ వీక్‌నెస్‌ని ఎంత ప్రయత్నించినా నేనిక వదులుకోలేను.

ఇంతకీ సుశీల నాకు స్నేహితురాలు కాదు. కనీసం క్లాస్‌మేటయినా కాదు. మాకు రెండేళ్ళు జూనియర్. అంటే కాలేజ్‌మేట్ అనొచ్చు నేమో! ఎప్పుడో లైబ్రరీలోనో, లేక ఫంక్షన్సేవయినా జరుతున్నపుడో బహుశా చూచి వుంటానేమో ఆమెని. ఆమె రూపం అట్టే గుర్తు కూడా లేదు నాకు అప్పటికి.

అల్లాంటి ఆవిడనుంచి హఠాత్తుగా నాకో రోజున వుత్తరం వొచ్చింది. పరిచయం లేని దస్తూరీని చూసి మొదటే విస్తుపోతూ కవర్ని చించిన నేను మరింత విస్తుపోయేను ఆ వుత్తరాన్ని చదివి.

నాలుగైదు వాక్యాల్లో నా గుణగణాల్ని కీర్తించి, తన కళ్ళతో చూచినంతవరకూ నా ఆకారాన్ని వర్ణించి ఆఖరున ఓ ప్రతిపాదన చేసింది—సుశీల-"మీరంటే ఇష్టం. పెళ్ళి చేసుకుందాం మీకిష్టమైతే" అని.

ఒకటి రెండు క్షణాలు.... నిమిషాలు అల్లాగే వుండిపోయేను ఆ వాక్యం చదివి. ఆపైన తిన్నగా ఆ విభ్రాంతి నుంచి తేరుకుని, నన్ను నేను సమాధాన పరుచుకుని నాకు తెలిసినంతలో సుశీల ఆకారాన్నీ, అంతరంగాన్ని వూహించసాగేను. అయినా లాభం లేకపోయింది.

అప్పటికి నా వుద్యోగ యత్నాలు ముమ్మరంగా సాగుతోన్న రోజుల్లోనే

ఆ అభిప్రాయం తొలుత ఎవరికి కలిగిందో తెలియదు గాని

"గుంటూరుకి అప్లయ్ చేసేనే ఆమధ్య-ఇంటర్‌వ్యూకి రమ్మని కబురొచ్చింది. వెళ్ళాలి నాలుగో తారీఖున" అని డైనింగ్ టేబుల్ ముందు నాన్నగారితో నేనంటే

"ఆ వూళ్ళోనే వున్నాడురోయ్ మన ప్రభాకరం. నీకు మామయ్యవుతాడు. ముందుగా నువ్వెళ్ళి వాణ్ని కలుసుకో" అని ఆయన అనడమూ,

"వాళ్ళకో అమ్మాయుండాలండోయ్... పేరు అరుణ. ఎప్పుడో గౌన్లు తొడుక్కునేప్పుడు చూసేను ఆ పిల్లని. ఎంత బావుండేదో అంతప్పుడే"

అని లోలోన సంబరపడిపోతూ అమ్మ మరో ఆచూకీ అందించడమూ

ఆ ఇద్దరి మాటల సారాంశం-అరుణ అని అని నేను తెలుసుకున్నానని

అటు వాళ్లకీ తెలిసింది ఇటు నాకూ తెలిసిపోయింది.

అమ్మ అడిగింది "అయితే రేపే బయల్దేరవూ?—రోజు బావుంది"

ఆ 'రోజు బావుండడం' నాకు వుద్యోగం రావడానికో- తనకి కోడలుపిల్ల రావడానికో నేనూహించలేననుకుంది అమ్మ.

ఆ మరునాడే నేను సూట్‌కేస్ సర్దుకుని "వెళ్లొస్తా"నని బయలు దేరుతుంటే

"ఉత్త చేతులతో వెళ్లేవు వాళ్లింటికి-పూలూ పళ్ళూ పట్టుకెళ్లు" అని చీరకొంగు ముడివిప్పి ఓ కదిరూపాయలనోటు అదనంగా నా జేబులో వుంచుతూ "అందర్నీ అడిగేనని చెప్పు. వీలయితే సెలవులకి రమ్మను-చాలా ఏళ్ళయింది చూసి" అంటూ మనసుతోనే నన్నేమని దీవించి పంపిందో అమ్మ!

గుంటూర్లో అటు బస్సు దిగి, ఆటో చేయించుకుని నాన్నగారు రాసిచ్చిన వీధి పేరు, ఇంటి నెంబరు మరోమారు తీసి చూసే అవసరంలేక మనసులోనే బాగా గుర్తుండి ఆటో డ్రయివర్‌కి చెప్పి అతను దించిన ఓ ఇంటిముందు సూట్‌కేస్‌తో నిలిచి, కాంపౌండ్ గేట్‌ని తెరుచుకుని, పూలచెట్ల పెంపకంలో మామయ్యకున్న

శ్రద్ధని, అభిరుచిని మెచ్చుకుంటూ వరండాలో నుంచుని అక్కడినుంచి ఎదురుగా కనబడుతోన్న కిటికీలోంచి లోపలి గదిలోని నా చూపుల్ని పోనిచ్చి

సన్నగా రేడియోలోంచి వినవస్తోన్న హిందీపాటల్ని వింటూ వాలుకుర్చీలో పడుకుని, పొడవాటి నల్లని జడని ముందుకి తీసి గుండెలమీద వొదులుకుని, తామర తూడుల్లాంటి చేతివేళ్ళతో అతి సున్నితంగా పట్టుకున్న పుస్తకంలోని పేజీని అప్పటికప్పుడే తిప్పుతూ కంటిరెప్పల తుమ్మెదల్ని కళ్ళ కలువలమీద రెపరెపలాడిస్తోన్న అరుణని చూసేను నేను.

ఒక్క పొడిదగ్గుతో నిన్ను చూసిన వెనక నా గొంతుక మూగపోయిందన్నట్టు నేనొచ్చేను నీ కోసమని నా వునికిని తెలియజేసేను నన్ను చూసి క్షణం కలవరపడి, అటు తిరిగివొచ్చి "ఎవరు కావాలండీ?" అని అడిగిన అరుణని 'నువ్వే నే' అని చెప్పబోయి అంతలోనే బనీను తొడుక్కుంటూ అటుగా వొచ్చిన మామయ్యని చూసి ఆగిపోయేను.

ఆయన మరింత దగ్గరగా వొచ్చి, నన్ను గుర్తించి "ఒరి పిడుగా! నువ్వట్రా రా....రా! అనుకుంటూనే వున్నా ఇవాళో రేపో వొస్తావని" అని నన్ను చెయ్యిపట్టుకు నడిపించి తీసికెళ్ళేడు లోపలికి.

"ఏమేవ్ అల్లుడొచ్చేడు" కేకేసి పిలిచేడు అత్తమ్మని.

ఆమె "ఎవరూ సుందరమా?" అంటూ వొచ్చి నా చేతిలోని సూట్‌కేస్ తీసి బల్లమీదుంచి నన్నూ, మామయ్యనీ మార్చి మార్చి చూసి "అప్పుడెప్పుడో సీతమ్మొదిన పెళ్ళిలో చూసేను బాబూ! నిన్ను దాంతో. ఇంతవాడివయ్యేక కనబడుతున్నావు మళ్ళీ. అంతేగా ఊళ్ళు దూరమైతే బంధుత్వాలూ దూరమౌతాయిట. ఇంట్లో అమ్మా నాన్నా కులాసా?" అని అడిగింది ఎంతో ఆప్యాయంగా.

"బావున్నా రత్తమ్మా! అమ్మ మిమ్మల్నందరినీ అడిగినట్టు చెప్పమంది. సెలవులకి తప్పకుండా రమ్మంది." అన్నాను నేనూ.

ఈ మాటల మధ్యలో చదువుతోన్న పుస్తకాన్ని అక్కడే పడేసి ఎప్పుడు తుర్రుమందో అరుణ లోపలికి. ఆ కనిపించడం కనిపించడం మళ్ళీ భోజనాల దగ్గరే.

అరుణ ఇంటర్ ప్యాసయింది-ట! ఆపైన చదవనందిట.

ఓ ఆడపిల్ల ఎదిగి కూచుని ఇక నేను చదవనంటే అందులో వున్న అర్థమేమిటో అత్తమ్మ మామయ్యలు తెలుసుకున్న సమయానికే నేను వాళ్ళకి చేరువయ్యేను.

ఆ సాయంత్రం ఇంట్లో అందరూ తీరిగ్గా కూచుని కబుర్లాడుకునే సమయంలో ప్రస్తావించేరు మామయ్య నా ఉద్యోగం గురించి,

"ఇంత మంచి క్వాలిఫికేషనూ, మెరిట్ వుండీ కూడా చచ్చు ఆ క్లర్కుగిరికి దేవిరించడం ఏమిటి? కాస్త నిదానించు—కాలేజీలో ఏవైనా వేకన్సీస్ వున్నాయేమో కనుక్కుంటాను" అన్నారాయన.

రైల్వేలో ర్యాంక్ వుద్యోగం మామయ్యది.

అత్తయ్య పుట్టి పెరిగింది కేరళలోనే అయినా కాలేజీలో మామయ్యని ప్రేమించి, పెళ్ళాడి, తెలుగింటి కోడలై విమెన్స్ కాలేజీలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా వుంటూ కూడా ఎంచక్కా మాట్లాడగలదు తెలుగు. ఆమె నోటంట తెలుగు వినడం అదో సంగీత విభావరి!

వాళ్ళ మంచి తనం, పరపతీ చూసేక నాకూ కొంత నమ్మకం కలిగింది వుద్యోగం మీద.

నా వూహాలు క్లర్కుగిరినుంచి లెక్చరర్ వరకు ఎల్లాగయితే వెళ్ళేయో అల్లాగా నా చూపులు అత్తమ్మ మామయ్యల నుంచి అరుణ మీదికి వెళ్ళేయి. అందమే ఆడదయితే అరుణలా వుంటుందని నా కళ్లు సాక్ష్యం ఇస్తాయి.

ఆ మేలిమి బంగారానికి అద్దిన మరో సువాసన తియ్యని గొంతుక.








టేప్‌లో విన్నాను అరుణ కంఠాన్ని, "చాలు ఈ జీవితం ధన్యమైంది" అనుకున్నాను.

అమ్మానాన్నల ఆశ, అత్తమ్మ మావయ్యల ఆశయం మేమిద్దరూ ఏకం కావడం. అందుకు తగిన అంగీకారాన్ని ఆ మొదటిసారే నాతో మాట్లాడిన అరుణ పెదాల చిరునవ్వుల్లోనూ,

ఇంటికి ప్రయాణమై సూట్‌కేస్ పట్టుకుని "ఇక వెళ్లొస్తా" నన్నపుడు ఆమె దిగులు చూపుల మబ్బుల్లోనూ నేను చూడగలిగేను....

అలా అరుణ అందాన్ని నా కళ్ళలో నింపుకుని, అంతటి అదృష్టాన్నీ నా భవిష్యత్తులోకి వొంపుకుని ఆ వూహల మత్తులో నేను పూర్తిగా మునిగితేలే సమయంలోనే నా కలా వుత్తరాల్లో తారసపడింది సుశీల.

కలల్లో అరుణ! ఉత్తరాల్లో మాత్రమే సుశీల!

ఆ ఇద్దరిలోను సహజంగానే నా మనసెవరివేపు మొగ్గు చూపుతుందో నేనిక వేరుగా చెప్పనవసరం లేదు. అందుకనే నా అభిప్రాయం కోసం ఎదురు చూస్తుంటా నన్న ఆమె ఉత్తరానికి బదులివ్వలేదు.

అదే అభియోగాన్ని మోపుతూ మరో వారానికల్లా ఇంకో వుత్తరం రాసింది సుశీల. అల్లాగే మరో నాలుగయిదు వుత్తరాలు వెంట వెంటనే.

ఇక చేసేదిలేక, ఆమె మనసుని నొప్పించడం ఎప్పటికో ఒకప్పటికి ఎల్లాగూ తప్పదని అనిపించేక ఆ అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తూ ఆమె కోరికని కాదంటున్నందుకు-కాదనవలసిన పరిస్థితి నాకప్పటికే ఏర్పడినందుకు-సంజాయిషీ చెప్పుకుంటూ రాసేనో వుత్తరం.

ఆ వుత్తరం రాసిన పది రోజుల కనుకుంటాను "ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలో పేరు రిజిస్టర్ చేయించాలి నువ్వు రా సర్టిఫికెట్లతో" అని మామయ్య రాస్తే వెళ్ళేను గుంటూరుకి. అక్కడ నా పేరు రిజిస్టర్ చేయించడమే కాదు - అప్పటికి లెక్చరర్ పోస్టొకటి ఖాళీగా వున్న కాలేజీకి అప్లికేషనూ పడేసేను. అంతమాత్రమే కాకుండా అతి ముఖ్యంగా అరుణలోని నా జ్ఞాపకాన్ని రెన్యువల్ చేయకుని మరీ తిరిగొచ్చేను ఇంటికి.

వీధి వాకిలి తీసుకుని నా గదిలోకి వెళ్ళి ప్రయాణపు బడలిక తీరేట్టు మార్చుకుంటున్నాను బట్టల్ని. అంతలోనే అమ్మ వచ్చిందక్కడికి. ఒకటి రెండు మాటల్లో మామ

య్యల క్షేమాలని పరామర్శించి "ఎవరో అమ్మాయొచ్చింది-నీ కోసం-సుశీలట!"

అవాక్కయ్యేను నేను. మళ్ళీ నోరు తెరిచి నే మాట్లాడే లోపునే అంది అమ్మ "తనేమో వెళతానంది నిన్ననే. కాని నేనే నిలిపేను ఇవాళ నువ్వొస్తావని. అదిగో ఆ వంటింట్లో వుంది. రా! కాఫీ తీసుకుందువు"

లుంగీ కట్టుకుని, బనీనుపైన భుజాల మీదుగా టవల్ కప్పుకుని అనుసరించేను అమ్మని. నా గదినుంచి వంటింటికి నడిచిన ఆ అరనిమిషంలోనే ఎన్నెన్నో విధాలుగా సుశీల రూపాన్ని వూహిస్తూ ఆ గదిలోకి వెళ్ళి, అమ్మ కూచునే పీటమీదకూచుని ఉల్లి పాయల్ని ముక్కలుగా తరిగి పెడుతోన్న సుశీలను చూసినప్పుడు నేను కొంత ఆశ్చ ర్యాన్ని, సంతృప్తిని పొందిన మాట వాస్తవమే.

ఎందుకంటే ఓ మామూలుపాటి అం దాన్నే ఎదురు చూసేను నేను సుశీలలో అంతకు మునుపు కాని ఆమె ఓ పిసినిగొట్టు ఎగ్జామినర్ చేతికి ఇంటెలిజెంట్ అయిన విద్యార్థి తాలూకు ఆన్సర్ షీట్ తగిలి నట్టే కనిపించింది నా కంటికి. అయినా ఆమెని చూచి "బాగానే వుంది" అనుకు న్నాను మనసులో.

అరుణనే నా కళ్ళతో నా దాన్నిగా అదివరకే నేను చూచి వుండనట్టయితే "చాలా బావుంది సుశీల" అనుకునే వాణ్నేమో!— చెప్పలేను.

"సారీ! మీరొచ్చే సమయానికి నేనూళ్లో లేను" అంటూ కూచున్నాను కుర్చీలో.

అమ్మ కాఫీ కలిపి ఇచ్చింది.

సుశీల ఏమని ఫీలవుతోందో మనసులో ఏ మాటా పలకలేదు. ఊరికే తల ఎత్తి ఒకే మారు నా కళ్ళలోకి నిలువునా చూసి మళ్ళీ దించేసుకుంది తలని.

"ఎక్కడయినా ప్రయత్నం చేస్తు న్నారా వుద్యోగానికి?" అడిగేను ఆమెను చూస్తూ, కాఫీ తాగుతూ,

"లేదు" అని చెప్పలేదు ఆవిడ నోటితో తల అడ్డుగా వూపింది అదే అర్థంతో.

"జస్ట్ ఫైవ్ మినిట్స్! తర్వాత మాట్లాడు కుందాం" గ్లాసుని టేబుల్ మీద వుంచుతూ ఆమెతో అని నడిచేను బాత్ రూం వేపు.

స్నానం ముగించి, పొడిబట్టల్లో తెల్లని మబ్బు తునకలా తయారయి సుశీల మళ్ళీ ఆ పెళ్ళిప్రసక్తిని తీసుకొస్తే అప్పుడు ఆవిడ కేమని సమాధానం చెప్పాలో, ఎల్లా సముదాయించాలో, నా మనసిదివరకే మరొకరిపై వుందని అంత ఖచ్చితంగా ఆమెతోనే అంటే అప్పటి సిచుయేషన్ ఎల్లా వుంటుందో అనే మీమాంసలో మునిగి 'ఏమయితే అయిందిలే' అనే నిర్ణయంతో అడుగు పెట్టేను నా గదిలో.

ఆ సమయానికే తను తెచ్చుకున్న బట్టల్ని చక్కగా మడతలుపెట్టి బ్యాగ్ లోకి సర్దుకుంటోంది సుశీల. చూడగానే అది ప్రయాణ సన్నాహంలా అనిపించి అడిగేను ఆవిణ్ని "ఏమండీ! అప్పుడే వెళుతున్నారా?"

ఆమె తలయెత్తి మునుపటిలాగానే నావేపోసారు ఆ సూదికళ్ళ చూపులతోనే చూసి మళ్ళీ మామూలుగా తన పని తాను కొనసాగించింది. సర్దిన బ్యాగ్‌ని మంచం కిందికి జరిపి స్టాండ్‌ని వున్న అద్దంలో మొహాన్ని చూసుకుంటూ తలని పైపైనే దువ్వుకోసాగింది.

నేను ఆమె వాలకం చూసి అమ్మ కూడా ఏదో ఈవిడకి అరుణని గురించి చెప్పివుంటుందన్న అనుమానమూ, ఇక ఎంత చెప్పినా ఈవిడ తన ప్రయాణం మానుకునేట్టు లేదన్న నిశ్చయమూ కలిగి ఆమె నాకు కనిపించే ఆ చివరి నిమిషాల్లో నయినా కొంత ఫ్రెండ్లీగా మాట్లాడి అను నయిద్దామన్న సదుద్దేశంతో ఏదో పెదవి కదప బోయేంతలోనే వొచ్చింది అమ్మ అక్కడికి.

"ఇదిగోనమ్మాయ్! పూలు.... తల్లో పెట్టుకో" అంటూ ఒత్తుగా చెండులా చేర్చి




కట్టిన సన్నజాజుల్ని స్టాండు మీదుంచి వెళ్ళింది.

సుశీల తల దువ్వుకుని, భరిణలోంచి కుంకుమ తీసి అతి జాగ్రత్తగా గుండ్రంగా తీర్చిదిద్దుకుంది నుదుటన. ఆ చేతికయిన కుంకుమని తన రంగుల ఓణీ చివర్లకి తుడిచేసి అందుకుంది పువ్వుల్ని. తల వొంచుకుని సిగలో వాటిని తురుముకుంటూ అడిగింది నన్ను సుశీల "అడవిమల్లె అంటే అర్థం—ఎందుకూ కొరగానిదనేగా?"

పెదవి విప్పి ఆమె నాతో పలికిన మొదటి మాట అది. విని కలవర పడ్డాను. సమయమూ సందర్భమూ లేని ఈ మాటని అడుగుతోందేమిటి ఈవిడ? ఆలోచించేను అప్పుడు నాకు గుర్తొచ్చింది—ఆవిడ రాసిన అన్ని వుత్తరాలకీ బదులుగా, చివరగా నేను రాసిన వుత్తరం.

అందులో నా పరిస్థితుల నన్నింటినీ తేటతెల్లం చేస్తూ ఆఖరున నే చేసిన ఒకే ఒక్క పొరపాటు—ఓదార్పుగా ఓ వాక్యం రాయడం—

"కలకాలం నా మనసులో అడవి మల్లెలా నిలిచిపోతావు సుశీలా!" అని.

అంతలా జ్ఞాపకం వుంచుకుని ఆ రెఫ రెన్సునే నా కిప్పుడు కలిగిస్తోంది సుశీల.

నేనన్నాను నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోడానికన్నట్టు "అడవి మల్లె అంటేనే స్వచ్ఛతకి మరో పేరు. నిష్కల్మషత్వానికీ, నిసర్గ సౌందర్యానికీ అదో సంకేతం"

నా మాట పూర్తి కావడం తరువాయి అమ్మ వొచ్చింది పళ్ళెం ఒకటి చేతబట్టుకుని, చీరా జాకెట్ పీసూ, ఆకూవక్కా, పసుపూ కుంకం, అప్పుడే చెట్లోంచి దూసిన సన్న జాజి మొగ్గలు కొన్నీ.

లోపలికొస్తూనే "అమ్మాయ్! ఇల్లా వొచ్చి కూచో" అంది అమ్మ కుర్చీముందు నుంచుని.

సుశీల తల్లి మొహంవేసి చూస్తూ "ఏమిటండీ! నాకెందుకివి?" అని అడుగుతూ ఆ పురమాయింపుని కాదనలేక వెళ్ళి కూచుంది కుర్చీలో. అమ్మ కుంకమ తీసి ఆమె తీర్చుకున్న బొట్టుపైనే తేలిగ్గా అద్ది "మాకా కూతుళ్ళు లేరు. ఉన్నదీవీడొక్కగానొక్క కొడుకు. ఏదో నువ్వొచ్చేవు... మా ముచ్చట కొద్దీ ఇది" అంటూ పళ్ళెన్ని అందించింది.

సుశీల దాన్ని తీసి పక్కన వుంచి

అమాంతం అమ్మ కాళ్ళకి వొంగి నమస్కరించింది. ఆ చర్యకి చలిస్తూ అమ్మ ఆమె భుజాల్ని పట్టి ఆప్యాయంగా లేవనెత్తింది. ఆ ఊపులో సుశీల కళ్ళలోంచి జారిన కన్నీటి బొట్లు పచ్చని అమ్మ పాదాల మీద పల పల రాలేయి.

"ఎందుకే పిచ్చిపిల్లా!" అంటూ సుశీలని కావిలించుకుంది అమ్మ.

"నీలాంటి దాన్ని కోడల్నిగా చేసుకోలేకపోవడం మా దురదృష్టం. నీ కెందుకే బెంగ. ఆ వుద్యోగం కాస్తా వొచ్చి నీ కాళ్ళ మీద నువ్వు నిలబడగలిగితే నీకేం తక్కువ?"

అంత వరకూ సుశీల ఏ ప్రయోజనం కోసమై మా ఇంటి గడప తొక్కిందో ఆ అసలు సంగతి అమ్మకి తెలియదనే అనుకుంటున్నాన్నేను. కాని అమ్మ నోటంట ఆ మాటని వినగానే ఆమెకి ఆ సంగతి తెలుసని తెలుసుకున్నాను. మొదట అరుణ విషయం తానై ప్రపోజ్ చేసి ఇప్పుడీ సుశీల ఇల్లా కళ్ళబడగానే ఈవిడ్ని కోడలిగా చేసుకోలేక పోయేననే ఆవిడ ఆదమనసునీ అర్థం చేసుకున్నాను. ఎటొచ్చీ అమ్మ ఇలాంటి విషయాన్ని నాన్నగారి చెవి వరకూ పోనివ్వదన్న నమ్మకం నాకున్నా "ఆయనేమంటారో తెలిస్తే" అనే అనుమానంతో తప్పుచేసిన వాడిలా—తప్పునాది కాకున్నా—అనవసరంగానే ఫీలయ్యేను. అక్కడ నిలవలేక పోయేను.

అమ్మ అంటోంది "ఇవాలిటికుండు సుశీలా! రేపటికెళుదువుగాని"

కాని వినిపించుకున్నట్టు లేదు సుశీల. బ్యాగ్ తీసుకుని బయటపడింది. వీధి వాకిలి దగ్గర నుంచున్న నాతో అంది "వెళతాను"

ఇటువేపు అమ్మ వుంది మా ఇద్దరినీ చూస్తూ, నాకేం చెప్పాలో తోచలేదు.

"వెళతాను కాదు. వెళ్లొస్తా ననాలి" అనబోయి అంతలో అలా అనబోవడం—నా నంచి తిరస్కరింప బడిన సుశీలతో-నాకే ఎబ్బెట్టుగా అనిపించి తల వూపేను మౌనంగా-వెళ్ళమన్నట్టు-వెళ్ళి రమ్మనట్టు!

ఆమె వెళ్లింది. వెళ్లిపోయింది — మా ఇంటినుంచి-క్రమంగా నా మనసున ఆమె వల్ల కలిగిన కల్లోలంలోంచి....

ఈ లోపున మా మయ్య రమ్మని రాసేను ఇంటర్వ్యూ వుందని నేను వెళ్లడం, సెలెక్ట్ కావడం, వుద్యోగం రావడం, నేను గుంటూరుకే మామ యింటికే మకాం మార్చడం— ఆ గడచిన రోజులు, వారాలు, నెలలు అన్నీ క్షణాల్లాగే అనిపించేయి నాకు అందులోనూ అరుణతో నా పెళ్లి రోజు దగ్గరయేకొద్దీ కాలమంతా వూహల్లోనే కరిగిపోసాగింది.

ఇక మా పెళ్లికి ఓ పదిహేను రోజులుందనగా స్నేహితులందరికీ శుభలేఖలు పంపుతూ ప్రత్యేకంగా ఒక వుత్తరమూ రాసేను—ఎట్టి పరిస్థితుల్లోనూ అకేషన్‌కి మిస్ చెయ్యొద్దనీ, ఎవరు రాకున్నా, నేను చాలా డిసపాయింట్ అవుతాననీ.

అల్లాగే సుశీలకీనూ. అయినా ఆమెకి రాస్తున్నపుడు మాత్రం చాలా క్షోభకి గురయ్యేను నేను. మొదట ఏమను కుంటుందో ఏమోనని పంపకపోవడమే మంచిదనుకన్నాను. అయినా ఆమెని కాదని తిప్పిపంపినపుడే లేని ఔదార్యం ఇపుడు మాత్రం ఎందుకు లెమ్మని పంపేను. ఉత్తరమూరాసేను చాలా మామూలుగా-జాగ్రత్తగా.

పెళ్లి మా వూళ్లోనే పెట్టుకున్నాము. విశాలమైన వీధి నిండుగా పచ్చని పందిళ్లు. ముంచెత్తే దీపాలవెలుగు. చుట్టాల రాక. అప్తుల పలకరింపులు. స్నేహితుల అన్నేళ్ల విరహం తర్వాతి తీపి కలయిక. బోలెడంత సందడి. సంతోషం వెల్లువ. ఊహాల పడవ. భవిష్యత్తీరాలకేసి ప్రేయసి కన్నుల వెన్నెల్లో పయనం.

ఇతరుల పెళ్ళిళ్ళనే ఎంతో బాగా ఎంజాయ్ చేసే నేను తీరా ఆ పెళ్ళి నాకే అయినప్పుడు ఇంకెంతగా ఆనందిస్తాను!

అయినా అంతటి ఆనందంలోనూ నా మనస్సు కలుక్కుమనడం ఒక్క సుశీల జ్ఞాపకంతోనే. ఎందువల్ల ఆమె రాలేదన్న అనుమానంతోనే. అందుకు తగ్గట్టే తక్కిన ఫ్రెండ్స్ అందరూ వొచ్చినా మావాడూ - సుబ్బారావు—రాలేదు ఎంతకీ.

రాడేమో అన్న గుబులు "వెధవ! రాలేదే ఇంకా" అనే కోపం.

అంతమంది బంధువుల ఎదుట కళ్యాణ మంటపం కిందట పురోహితుడు పలికే శ్లోకాలనే పలుకుతూ నా పక్కన వెన్నెల కుప్పలా మునుపెన్నడూ లేనంత అందంగా, సిగ్గుతో మురిపెంగా, ముద్దుగా కూచున్న అరుణని కనకొసల్లోంచి చూస్తున్నప్పుడెంత ఆనందం!

ఎదురుగా వాకిలికేసి 'ఇప్పటికయినా వొస్తాడేమో సుబ్బారావు' అని ఆశగా చూస్తున్నప్పుడెంత ఆరాటం?

సుశీల రాదే! ఏమయింది? వుద్యోగం వొచ్చిందా? ఊరు మారిందా? ఎవరినయినా పెళ్లాడిందా? అని ఆలోచిస్తున్నప్పుడెంత ఆందోళన!

తీరా ఆ అందరి చూపుల మధ్య, హోమంలో వేసిన నేతి సువాసనలమధ్య, నాతిచరామి వాగ్దానాలమధ్య, పీటలమీద కూర్చున్న మా కన్నుల కలయికలమధ్య మాంగల్యధారణ జరుగుతోండగా

ఆ హోమం పొగల సెగలు కమ్మిన కళ్లతో ద్వారంవేపు చూస్తే.

"మీలా పైలా పచ్చీసు కాదోచ్. నేనో బిజీ అయిన బిజినెస్ స్టార్"ని అన్నట్టుగా అపుడే రంచనుగా దిగేడు సుబ్బారావు.

ఆ వేళకి నా కొంగు అరుణ కొంగుతో ముడేసివుండబట్టి సరిపోయిందిగాని లేదంటే వున్నఫళంగా వెళ్లి వాని బుగ్గలు బూరెల్లా వుబ్బేట్టు ఎడాపెడా వాయించేవాణ్ణే!

ఏమయితేనేం? మూడు ముళ్ళూ వేసే సమయానికే ముహూర్తంలా వొచ్చేడు వీడు. చాలనుకున్నాను.

మాంగల్య ధారణ జరిగింది. మంటపానికి ప్రదక్షిణలూ అయ్యేయి.

కలిసి ఏడడుగులు నడవమంటే పురోహితుడు "నేనూ అరుణా కలిసి ఇప్పటికే ఎన్ని వేలడుగులు నడిచేమో నీకేం తెలుసు వెర్రిమొహమా!" అనుకుంటూ ఆ ఏడడుగులూ నడిచేను అరుణతో.

ఆపైన ద్వారం దగ్గర పేర్లు చెప్పమని అటకాయింపు పదిమందిలోనూ నా పేరుని పలకలేక సిగ్గుతో తల వాల్చేసుకున్న అరుణమీద వరసైన ఆడ బిడ్డల విసుర్లు, సాధింపులు, అది గడిచి లోపలికెళ్లేక పాలు పండూ చూపుల కవ్వింపులకి మల్లే సగం సగం ఆరగింపులు.

అయ్యేక "విప్పకూడదు ఇప్పుడే" అని సాధించే అత్తమ్మల్ని బతిమాలి,

"ఫ్రెండ్ అరుణా! వొచ్చేస్తాంగా" అని ఆమె తల్లోని పువ్వులు తగులుతోండగా చెవిలో చెప్పి,

పందిటి కిందికి చేర అప్పటికే సిగరెట్ సేవనల్లోకి దిగిన ఫ్రెండ్స్ మధ్య వెదికి పట్టుకున్నాను సుబ్బారావుని.

ఏదో పని వున్నట్టు వాణ్ణి పక్కకి లాక్కెళ్లి "ఇంత ఆలస్యంగానా రావడం?" అని చరుస్తూ అడిగేను వాణ్ణి ఆత్రుత చంపుకోలేక "సుశీలకి వెడ్డింగ్ పంపేను. ఆవిడరాలేదు. నాకోసం ఆవిడ వివరాలని కనుక్కుంటానన్న వెధవ్వి నీకు తెలుసా... ఎక్కడుంది సుశీల?"

నావైపు అదోలా చూసేడు సుబ్బారావు.

"నా ఆ స్యానికీ ఆవిడే కారణం. మనసు బావుండలేదు" చెప్పేడు.

అప్పుడు గమనించేను వాణ్ణి. నలిగిన బట్టలు, చెదిరిన క్రాపు

ప్రయాణపు బడలికే కాదు — ఏదో చేజారిన దైన్యం!

"విషయమేమిటి? ఊళ్లో నేనా ఆమె వుండడం?" అడిగేను.

"పసుబ్బట్టల్లో వున్నావు నీకెందుకీ వార్త చెప్పడం?" తటపటాయించేడు.

"ఫరవాలేదులే ఏమైందో చెప్పరా చంపక" గట్టిగా వాడి చేతులు పట్టుకున్నాను.

"సూసైడ్ చేసుకుంది సుశీల"

నాబట్లు చప్పున చల్లనయింది నాలో ఏదో భయం ఆవరించింది.

"నీకెల్లా తెలుసు? చూసేవా నువ్వు?" అడిగేను వాడు విన్నదో, చూసిందో అబద్ధం కావచ్చునన్న భ్రమతో.

"నిన్న సాయంకాలమే నేనిక్కడికి రావాలని బయలుదేరుతోండగా మా వీధిలోనే ఓ హాస్పిటల్ ముందు జనం గుంపు కూడితే ఏమిటో అని వెళ్లిందిట మా అక్క. వెళ్లిన అరగంటకి తిరిగొచ్చింది.

"పాపం.... పెళ్ళి కావలసిన పిల్ల, బాగా చదువుకోనూ చదువుకుంది. అదేం ప్రారబ్ధమో నిద్ర మాత్రలు మింగింది. కొన ప్రాణం ఇక్కడికొచ్చేక గాల్లో కలిసింది. ఇక్కడికి కొంత దూరంలోనే ఏదో పల్లెట ఆ అమ్మాయిది"

అంతా అయి చేతికి సూట్ కేస్ అందుకోబోయి మా ఆవిడతో అంటోన్న ఆవిడ మాటలు విని ఎందుకో అనుమానం వొచ్చి వెళ్లేను హాస్పిటల్ కి. రద్దీగా వున్న జనం లోంచి దారి చేసుకుని వెళ్లి చూస్తే ఈ సుశీల! గుండె ఆగినట్టయింది ఆ క్షణం. అయినా ఏం చెయ్యను? ఊరికే ఆమెని చూసి ఎవరో ఎరగనివాడిలా ఏం చెబితే ఏ అనర్థం ముంచుకొస్తుందో అన్న అనుమానంతో వొచ్చేసేను ఇంటికి. ఆ మధ్య నువ్వూ మీ ఇంటికొచ్చినప్పుడు చెప్పేవు ఆమెని గురించి. అందుకని నేనూ కొంత విచారిస్తే తెలిసిన విషయం—పెళ్ళి పట్ల నీ ఉద్దేశం వేరుగా వుండడం గ్రహించి నీకు తెలపలేదు — సుశీల కెవరూ నా అన్న వాళ్ళు లేరట... ఒక్క అమ్మ తప్ప. అన్నయ్యొకడున్నా వాడు లేనట్టే లెక్క జులాయి తిరుగుళ్లు తిరుగుతూ ఇంటి విషయాలేవీ అస్సలు పట్టించుకోడట. అందులోనూ ఈమధ్యే వాళ్లమ్మకి జబ్బుచేసి హాస్పిటల్లో చేర్పిస్తే ఓ నెలనాళ్ళకి ఆ బెడ్ మీద వుండే పోయిందట ఆమెకూడా. అంతో ఇంతో అంగబలంతో బాటుగా అర్థబలమూ వున్న మనలాంటివాళ్లమే వుద్యోగాలు సంపాయించుకుని మన కాళ్లమీద మనం నిలబడలేని ఈ రోజుల్లో ఒక ఆడపిల్ల -అందునా ఒంటరిది-ఎలా బ్రతగ్గలదు? అంచేత ఏవో సంస్కరణలని, ఆదర్శాలని అంటూ వుంటావనీ, నువ్వయినా ఆమని అర్థం చేసుకుని ఆదరించగలవనీ, తనకింత నీడ నివ్వగలవనీ నీకిలా వుత్తరం రాసింది. నీనుంచీ ఆ ఆశా ముక్కలయి తిరస్కారమే ఎదురయితే అప్పుడిక చేసేది లేక చావులోనే తన సమస్యకి శాశ్వత పరిష్కారాన్ని ఎన్నుకుంది"

ఆత్మహత్యలతో ముగిసే కథలంటేనే అంతగా సుముఖత వుండేది కాదు నాకు సహజంగా. జీవితంలోనే అల్లాంటి సన్నివేశాన్ని ఎదుర్కొన్నాను నేనిప్పుడు — ఏమనుకోను? "సుశీల గురించి ఏమయినా తెలిసిందా తర్వాత?" అని అడిగితే అమ్మకి సమాధానం ఏమని చెప్పను? అందునా ఆవిడ ఆత్మహత్యకి పరోక్షంగా కొంతలో కొంత కారణభూతుణ్ణయిన నేను! ★

# ఈ మాసం మీకోసం

"పాపమంటే? నువ్వు పుణ్యానివైతే మరి పాపమేమిటి?" అని "చిత్రలేఖ" హిందీనవల లోని మొదటి వాక్యంతో ప్రారంభమై ఉత్తర భారతదేశంలోని జన జీవితాన్ని బహు ముఖాలుగా చిత్రించిన ప్రఖ్యాత రచయిత భగవతీచరణ్ వర్మ.

తొలుత భావనామయలోకంలో కల్పించు కొన్న పాత్రలద్వారా, నిరంతరం మనిషిని వెంటాడుతున్న పాపం పుణ్యం అనే ప్రశ్నలను శోధించి తాత్వికంగా తిరిగి మరో ప్రశ్న చిహ్నాన్ని వదిలివెళ్ళిన కవి, శబ్దశిల్పి భగవతీబాబు కవిత, కథానిక, నవల, వ్యాసం, నాటకం, సినేరియో, పత్రికారచన, విమర్శ తదితర ప్రక్రియల్లో జీవితాంతం రచనలు సాగించిన వర్మగారు లక్నో దగ్గర శఫీపూర్ గ్రామంలో జన్మించారు. 78 సం. ల సాహిత్య జీవితం గడిపాడు. అంతిమ దశలో ఆయన క్యాన్సర్ వ్యాధిపీడితుడు. జీవిత కాలంలో 35 గ్రంథాలు రచించి ప్రచురించారు.

భగవతీబాబు 1934 లో రచించిన "చిత్రలేఖ" నవల ఆయనకు ఎంతో ఖ్యాతి-డబ్బును ఆర్జించిపెట్టింది. ఇరవై ముద్రణలు పొందిన ఈ నవల అనేక భారతీయ, విదేశీ భాషల్లోకి అనువాదమైంది.

1950 కు పూర్వం ప్రసిద్ధ రంగస్థల సినీనటుడు శోరాబ్ మోడి "చిత్రలేఖ"ను సినిమాగా తీసాడు. ఆ తర్వాత 1960 లో మీనాకుమారి, అశోక్ కుమార్ ప్రధాన పాత్రలుగా రంగుల చిత్రంగా వచ్చింది.

చంద్రగుప్తుడి కాలంలో "చిత్రలేఖ" కథా ఇతివృత్తం జరిగినట్టు రచయిత ఒక చారిత్రక భూమికను కల్పించాడు. ఆయన ప్రధానంగా సౌందర్యం-తృష్ణ-మోహం

## చిత్రలేఖ శిల్పి-భగవతీచరణ్ వర్మ

### నిఖిల్

ఆరాధనలచుట్టూ అల్లుకున్న పాపం-పుణ్యం అనే అనాది ప్రశ్నలను ఈ నవల ద్వారా చర్చించాడు

అతిలోక సౌందర్యవతి "చిత్రలేఖ" గుప్తుడి కాలంలో ఒక రాజనర్తకి. యువ రాజు బీజగుప్తుడు ఆమెను ప్రేమించి ఆరాధిస్తాడు. ఆయన గురువు-సన్యాసి కుమార గిరి. ఆస్థానంలో నిరంతరం మధిర-మానిని అనే మృగతృష్ణ వెనకాల జీవితాన్ని నిరర్ధకం చేసుకోవద్దని కుమారగిరి బీజ గుప్తుణ్ణి హెచ్చరిస్తుంటాడు. తన ఆకర్ష ణతో—సౌందర్యమనే కామవాంఛా లోలుడిగా యువరాజును తప్పుదారి పట్టిస్తున్నదని కుమారగిరి మొదట్లో ద్వేషిస్తాడు.

సౌందర్యం—ఆకర్షణ—వాంఛలో పాపం పుడితే "మీరనుకునే నిరాసక్తత-ఆధ్యాత్మికత పుణ్యమైతే" మరి పాపమేది? అని చిత్రలేఖ ప్రాపంచిక తర్కంతో కుమారగిరిని ఎదుర్కొంటుంది అపురూపమైన అందంతో బాటు అంతర్గతమైన లౌకిక జ్ఞానంతో ప్రశ్నిస్తుంది.

"ఈ ప్రపంచం నుంచి పారిపోయే వాడివి భగవంతుణ్ణి ఎలా పొందుతావ్? ఈ లోకాన్ని అనుభవించలేని వాడివి ఆ లోకాన్ని ఎలా సొంతం చేసుకోగలవ్?"

క్రమంగా "చిత్రలేఖ" యదార్థ వాదం సౌందర్యం కుమారగిరిని ఆకట్టుకుంటాయి. గురువుగారే చివరికి ఆమె ప్రేమలో—వ్యామోహంలో పిచ్చివాడవుతాడు. ఈ పరిణామాన్ని యువరాజు బీజగుప్తుడు పరిణతమైన మనస్సుతో అర్థం చేసుకుంటాడు. అయితే కుమారగిరి "చిత్రలేఖ" పట్ల పెంచుకున్న ప్రేమ వెర్రి వ్యామోహంగా మారేసరికి "చిత్రలేఖ" అతన్ని అసహ్యించుకుంటుంది. చివరికి తాను వ్యక్తిగతంగా ఆధ్యాత్మికంగా ఓడిపోయానని కుమారగిరి ఆత్మహత్య చేసుకుంటాడు. రాగం-విరాగం ప్రవృత్తి-నివృత్తి, పాపం-పుణ్యం వీటి మధ్య యువరాజు బీజగుప్తుడు ఎంతో ఉదాత్తంగా ప్రవర్తిస్తాడు. ఈ నవల ద్వారా భగవతీచరణ్ వర్మ పాప-పుణ్యాలనే అనాది సమస్యలను సమయ-సందర్భాల కనుగుణంగా మనో వైజ్ఞానిక దృష్టితో వివేచిస్తాడు. అయితే ఈ సమస్యకు మరో ఆధారభూతమైన భౌతిక (ఆర్థిక) యదార్థాన్ని ఇందులో విస్మరించడం ఆయన లోపం. ఈనవలకు అనతోల్ ఫ్రాన్స్ రచించిన ఫ్రెంచినవల "థాయా" ఆధారమని కొందరు విమర్శకులు మొదట్లో అనుమానించారు ఇది వాస్తవం కాదని ఆతర్వాత ఇతర విమర్శకులు విడమర్చి చెప్పారు.

ఆత్మాశ్రయ వైఖరితో (భావవాద ధోరణి) మొదట వర్మగారు కావ్యరచనతో తమ సాహిత్య వ్యాసంగాన్ని ఆరంభించారు మధుకణ్, నూర్‌జహాఁకె కబ్ర్ ప్రేమ సంగీత్, మానవ్ అనే కావ్యాలను వెలువరించారు.

19?? లో వర్మగారు మొదటి నవల "పతన్" తో గద్యరచన ప్రారంభించారు. "చిత్రలేఖ" తో హిందీ సాహిత్యంలో చెక్కుచెదరని స్థానాన్ని సంపాదించారు. "భూలే బిసరే చిత్ర" (మరచిన చెదరిన చిత్రాలు) నవలకు 1961 లో కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి అందుకున్నారు. రాజ్యసభ సభ్యుడిగా పార్లమెంటు జీవితాన్ని చవిచూసారు. 1971 లో పద్మ విభూషణ ద్వారా ప్రభుత్వ గుర్తింపు కూడా పొందారు.

భగవతీబాబు ముఖ్యమైన రచనలు- "వసీహత్" (నాటక సంపుటి) "త్రిపథ్‌గా" (రేడియో రూపకాలు) "సాహిత్యకే సిద్ధాంత్ తధారూప్" (విమర్శన) "హమారీ ఉలజన్" (వ్యాస సంకలనం) చివరి నవల "యువరాజ్ చూడా" (19 ) "దుప్పల్" పేరుతో 19?1లో ఆయన మరణానికిముందే ఒక కథా సంపుటి వెలువడింది రెండు మూడు నవలలు ఇంకా అప్రచురితంగా మిగిలిపోయాయి,

స్వాతంత్ర్యోద్యమకాలంలో ప్రజా—

## ఉప్పెన

ఏకాంతంలో మొలకెత్తే
ఆలోచనా విత్తనం
యాంత్రిక జీవితపు
మర్రి చెట్టు క్రింద చిగురించదు
ఆవేశంతో ముందుకొచ్చే
చైతన్య తరంగం
వ్యవస్థ ఇసుక గట్టును
అధిగమించదు
అయినా!
ప్రకృతి ఇంతేనని
భ్రమ పడకండి!
అలను అలను సమీకరించి
ఉప్పెనకై ఉరికించే ఒరవడిలో
కట్టలు తెగిపోతాయి
చెట్లు పడిపోతాయి
సమతల మైదానంలో
మొక్కలు పుష్పిస్తాయి

— గణేష్ బాబు

ఉద్యమాలను ప్రత్యక్షంగా చూసి-పాల్గొని రచించిన నవల "టేఢేమేఢే రాస్తే" (వంకర-టింకర దారులు) ఈ నవలలో ఆయన ప్రధానంగా గాంధీ వాదం-సోషలిజం-టెర్రరిజంలమధ్య జరిగే తాత్విక-ప్రత్యక్ష సంఘర్షణను తులనాత్మక దృష్టితో ఇతివృత్తంగా మలిచారు.

భారతదేశంలోని గ్రామీణ జీవితంలోని కరుణను-దోపిడిని గుండెకు హత్తుకొనే విధంగా కథలు రచించారు. "దై సాంగడీ", "ప్రాయశ్చిత్" లాంటి కథల్లో భూస్వామ్య విధానాన్ని, మూఢనమ్మకాలపేరిట పెరిగిన బ్రాహ్మణ్యంలోని దోపిడిని సహజంగా, వ్యంగ్య ధోరణిలో వర్మగారు చిత్రించారు.

హిందీ సాహిత్య విమర్శకులు భగవతీ బాబు గురించి మనముందుకు తెచ్చిన అత్యంత ప్రధానమైన అంశం ఒకటివుంది. వర్మగారు రచించిన మూడు నవలలు-"భూలే బిసరే చిత్ర" "సీధీ సచ్చీ బాతే", "ప్రశ్న ఔర్ మరీచిక"లలో 75 సంవత్సరాల (1855 నుంచి 1960 దాకా) భారత దేశ చరిత్రను ప్రతిబింబించారు.

1959 లో వెలువడిన "భూలే బిసరే చిత్ర" (మరచిన చెదరిన చిత్రాలు) నవలా కాలం 1885 నుంచి 1930 వరకు మూడు తరాల గ్రామీణజీవిత చరిత్రకు అద్దంపట్టి ఉత్తర ప్రదేశ్‌లోని రైతాంగ యదార్థ వ్యథార్థ దృశ్యాలను సజీవంగా మనముందు నిలిపారు

1968లో ప్రచురించిన "సీధీ సచ్చీ-బాతే" (సూటైన యదార్థాలు) నవలలో ఆయన బ్రిటిషు పాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాట కాలంలో జాతిజీవితాన్ని విపరీతంగా ఆలోచింపచేసిన గాంధీతత్వం — టెర్రరిజం (వ్యక్తి హింసావాదం)ల మధ్య సంఘర్షణను చూపించారు.

1973లో వచ్చిన నవల "ప్రశ్న ఔర్ మరీచిక" ఇందులో 1947 తర్వాత జాతి జీవితంలో వేగంగా వచ్చిన మార్పులు, దిగజారిపోయిన మానవవిలువలను ఆయన ఇతివృత్తంగా తీసుకున్నారు. ఈ నవలాత్రయం ద్వారా మనదేశ చరిత్రను సామాన్యుడి అగచాట్లు-ఆనాటి జాతీయ ఉద్యమాలు రాజకీయ పోరాటాలు సమన్వయించి భగవతీబాబు ఈ దేశ జన జీవితాన్ని సమగ్రంగా దర్శించారు-తద్వారా ఉత్తర భారత దేశంలోని రాజకీయ పరిణామాలను ఉద్యమాలను మనకు కళ్ళకు కట్టించారు. ఈ నాటికీ ఉత్తర భారత రాజకీయ పరిణామాలే మొత్తం భారత జాతి రాజకీయ భవిష్యత్తును నిర్ణయాత్మకంగా మార్చగలుగుతున్నాయనేది ఒక చారిత్రక




యదార్థం. ఈ యదార్థాన్ని వర్మగారి ఈ మూడు నవలలు చదివితే మనం స్పష్టంగా అర్థంచేసుకోగలము. అలాగే ఇంత సమగ్రంగా ప్రజాజీవితాన్ని నవలల్లోకి నడిపించిన రచయిత మన తెలుగులో లేడు (అయితే కొంతమేర "మాలపల్లి", "ప్రజల మనిషి" నవలలను, మహీధర రామమోహనరావుగారి నవలలను మినహాయింపులుగా తీసుకోవచ్చును).

భావవాదిగా మొదలై నియతివాదాన్ని నమ్మిన భగవతీబాబు విశిష్టత-పతనమైపోతున్న మానవ-విలువలను ఎత్తిచూపి ధైర్యంగా ప్రశ్నించడంలోవుంది.

ఈ వ్యవస్థ మార్పుకోసం-మంచికోసం రచనలు చేసిన వర్మగారు 'ఒక ప్రశ్నించే యాత్రికుడిగా', 'వ్యక్తిశీలం' అత్యంతకీలకమైన అంశంగా నమ్మిన ఆదర్శవాదిగా సాహిత్యలోకంలో నిలిచిపోయారని విమర్శకుల అంచనా.

కవి-విమర్శకుడు ధర్మవీర్ భారతి అభిప్రాయంలో– "హిందీ సాహిత్యంలో ఒక విశిష్టమైన కథకుడు భగవతీబాబు. ఈ సమాజంలోని అంతర్గతమైన-బాహ్యమైన మార్పులను, స్తంభించిపోయిన పరిస్థితులను ఆయన చిత్రించారు. కుటుంబాలజీవితాలతో బాటు సంఘటనలను పేర్చుతూపోవడమే గాకుండా మానసిక సంఘర్షణను ఎంతో నైపుణ్యంగా విశ్లేషించారు, ఆ జీవితాల చుట్టూవున్న సామాజిక-రాజకీయ-ఆర్థిక చిత్రాలను తద్వారా బహిర్గతం చేసారు."

సాహిత్యరీత్యా శిల్పిగా పేరు తెచ్చుకున్న భగవతీచరణ్ వర్మ వ్యక్తిగతంగా మానవతావాది-తాత్త్వికదృష్ట్యా సంస్కరణవాది. ఆయన ఉన్మత్త ధోరణి ఈ కవితా పంక్తుల్లో వ్యక్తమవుతోంది.

"అందరూ అలా ఆశ్చర్యంగా అంటూనే వున్నారు-'నువ్వు ఎలా వచ్చావు? ఎక్కడికి వెళ్ళిపోయావ్?' ధూళి రేపుతూ నేను ఎక్కడికి వెళ్ళినా భావనాలోకం సాగిపోయింది నా వెంటే!"





# పాపాయికి అతి ఉత్తమమైనవి తల్లిపాలు

**పాపాయికి చనుబాలు ఎందుకు ఉత్తమమైనవి**

తల్లి పాలు పరిశుభ్రమైనవి, సూక్ష్మజీవులు లేనివి, పసి బిడ్డ జీర్ణ శక్తికి నూటికి నూరు పాళ్లూ అనువైనవి. వివిధ రోగాల పట్ల తల్లికి వుండే రోగ నిరోధక శక్తి చనుబాలద్వారా బిడ్డకు లభించటమే కాక, పాపాయి తల్లి ప్రేమనూ, రక్షణనూ కూడా అనుభూతి చెందుతాడు. అతడికి కడుపుకు సంబంధించిన బాధలూ, చర్మం పొక్కులు లేవడమూ కూడా సాధారణంగా రావు. 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు.

3 నెలలు నిండాక, డాక్టర్లు ఫారెక్స్‌ను సిఫార్సు చేస్తారు.




ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారుచేయబడిన ఆహారం ఫారెక్స్. దీనిలో కార్బోహైడ్రేట్లు, క్రొవ్వు పదార్థాలు, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు ఉన్నాయి. ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది. అందుకే, పాపాయి సంపూర్ణమైన పెరుగుదల కోసం ఆదర్శవంతమైన ఘన ఆహారం ఫారెక్స్

డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

[illegible], సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-11-163 TEL

మి నీ క థ

# పైమెంత?

## యామిజాల ఆనంద్

ఓ౯ ముసలాయన పార్కులో సోఫా మీద ఒక్కడే కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ ఆనందిస్తున్నాడు. ఇంతలో ఆయనకి కొంత దూరంలో కూర్చుని వున్న యువకుడు లేచి వచ్చాడు.

ముసలాయన వద్దకు వెళ్ళి "టైమెంత యింది సార్" అని అడిగాడు.

ముసలాయన బదులు చెప్పలేదు. పరధ్యాన్నంగా వున్నట్టే మొహం పెట్టి కూర్చొన్నాడు.

యువకుడు ఆయనకి చెవుడేమో అనుకొని ఇంకా గట్టిగా అడిగాడు "టైమెంత యిందండీ" మరోసారి, మరోసారి చాలా సార్లు అడిగాడు.

"టైమెంతయిందండీ" అని

చివరికి విసుగుపుట్టి యువకుడు వెళ్ళిపోయాడు. ఇదంతా చూస్తూన్న మరో కాయన ముసలాయన దగ్గరకెళ్ళి "మీకు చెముడా?" అని అడిగాడు.

"లేదు"

"మరి ఆ అబ్బాయి అడిగిందానికి జవాబు చెప్పలేదేం?"

"ఇదిగో బ్రదర్ నేను నా మానాన నేను కూర్చొంటే ఆకుర్రాడు ఎందుకు పలకరించాలి? టైం చెబుతాననుకో ఏమవుతుంది? ప్రక్కన కూచొని ఏదో మాట్లాడటం మొదలు పెడతాడు! నేనేదో మాట్లాడవలసి వస్తుంది. అలా కొంచెం సేపు కబుర్లు అయిన తరువాత నేను మాయిల్లు ఇక్కడికి దగ్గరే కాఫీ కాస్త తాగి పోదువు గాని రావయ్యా అంటాను. అతను వస్తాడు! వస్తాడా?"

"వస్తాడండీ వస్తాడు"

"మా అమ్మాయి కాఫీ పట్టుకు వస్తుంది. వస్తుందా?"

"వస్తుందండీ వస్తుంది."

"అవునా! దానికి పదిహేడేళ్ళు. అప్సరసలా వుంటుంది. ఆ అమ్మాయిని వీడు చూసి చూడగానే ప్రేమించేస్తాడు. వీడు కాస్త ఎర్రగా బుర్రగానే వున్నాడు గనక మా అమ్మాయి కూడా వీణ్ణి ప్రేమించ వచ్చు! వచ్చా?"

"వచ్చండీ వచ్చు"

"ఇహ వాడు నెమ్మదిగా బయట పెడతాడు. మీ అమ్మాయిని చేసుకోవాలని వుంది. అవటా అని"....అమ్మాయి కూడా అదేమాట అంటుంది. మా అమ్మాయి మాట తీసెయ్యలేక చివరికి పెళ్ళి చెయ్యక తప్పక పోవచ్చు"

"పోవచ్చు?"

"పోవచ్చండీ పోవచ్చు"

"అదుగో అక్కడే వస్తుంది చిక్కంతా చేతికి రిస్టువాచి కూడా లేనివాడికి, నా పిల్లను ఎలా ఇవ్వనూ అంటూ?" అని ముసలాయన లేచి చక్కా పోయాడు.

# భారత దేశంలో భర్త!

## పి. కుసుమకుమారి

ఇష్టంలేని పని చెయ్యవలసి రావడం కంటె కష్టమేముండాలి నావంటి వాడికి? అర్జంటుగా తిరుపతి వెళ్ళమని ఆఫీసువారి తాఖీదు. రిజర్వేషను చేయించుకుందుకయినా వ్యవధి లేదు. పైగా—"తిరుపతయితే నేనూ వొస్తా. మొక్కుంది—" అంటూ వెంటపడింది బామ్మ. ముసిలివాళ్ళతో— ఆడ ముసిలివాళ్ళతో ప్రయాణమంటే యిక చెప్పేదేముంది? అందులోనూ యీ బామ్మ మామూలు బామ్మ కాదు. నన్ను పెళ్ళిచేసుకోమని అస్తమానూ పో(భో)రు తుంది. మనవణ్ణెత్తెయ్యాలని తన సంబరమే కాని పెళ్ళిచేసుకుంటే నేనెన్ని బాధలూ కష్టాలూ పడాలో ఆవిడ ఆలోచించదు. చెప్పినా వినదు. ఆవిడ కిష్టంలేని మాటలు చెబుతూంటే చెముడొచ్చేస్తుంది. తనకి కావలసినవి మాత్రం వినపడతాయి. దీన్నే బామ్మ చెముడంటాను.

పోర్టరుకి లంచమిచ్చి రైలులో సీట్లు సంపాదించి పెట్టమన్నాను—టుటయ్యర్, త్రీటయ్యర్ల ఆశ పూర్తిగా చచ్చిపోయాక. పోర్టరు చాకచక్యం కానివ్వండి, దబాయింపు కానివ్వండి జనరల్ కంపార్టుమెంటులో మాకు సీట్లు దొరికాయి! నాకూ బామ్మకీ ఎదురెదురుగానే!

"దేముణ్ణి నమ్మనంటావు, తిరపతి వెంకన్న దయ కాకపోతే యింత రష్టు (రష్)లో మనకి సీట్లు దొరకడమేమిటి? తిరపతి వెంకన్న తలుచుకుంటే జరగనిదుండదు...." అంది బామ్మ సీటులో కూర్చుని మూటలు బల్లకింద సర్దుతూ,

"తిరపతి వెంకన్న దయ కాదు, పోర్టరు ఘనత. వాడికి నేనిచ్చిన లంచం...."

నా మాటలు ఆవిడ వినిపించుకోలేదు. పక్కన కూర్చున్న శాస్త్రిని కదిపింది. "ఎంత వరకూ నాయనా?"

"వచ్చే స్టేషనే అండీ. టెన్నిస్ పోటీలున్నాయి......" పొరపాటున చెప్పి ఉంటాడు ఆ విషయం అతను.

"నువ్వు-టెన్నిసాడుతావా నాయనా!" బోలెడంత ఆశ్చర్యమూ ఆనందమూ పడిపోతూ సీటు కడ్డంతిరిగి అతన్ని ఆప్యాయంగా చూసింది బామ్మ ఆత్మ బంధువుని మల్లె. "వారూ యింతే. ఎప్పుడూ టెన్నిసంటూ ఊళ్ళుపట్టుకు తిరిగేవారు. మహా బాగా ఆడేవారు. అందుకే స్నేహితులు ఆయనని యింటి పట్టున ఉండనిచ్చేవారు కాదు. బయటకు వెళ్ళారంటే చాలు ఓ కప్పో మెడలో పట్టుకొచ్చారన్న మాటే. భోషాణం నిండిపోయింది - వారు పట్టుకొచ్చిన కప్పులతోటీ మెడల్సులతోటీ. అసలు సిసలయిన వెండివి...."

వింటున్న నేను విభ్రాంతుడినయ్యాను. తాతగారంతటి ఘన టెన్నిస్ ప్లేయరా! వారి పేరే నాదీను. నాకు రాకెట్ పట్టుకోడమే రాదేం? పోనీ....ఇంట్లో మచ్చుకో కప్పూ మెడలూ అయినా మిగలలేదేం?

రైలాగింది. టెన్నిస్ ప్లేయరు రాకెట్ తీసుకుని దిగిపోతే—ఎవరో భావకవిలాటి శాస్త్రి వచ్చి బామ్మ పక్కన కూర్చున్నాడు. రైలు కదలడమేమిటి, అతను కూనిరాగం తీయసాగాడు. కొందరంతే. రైలెక్కితే

హాస్యకథల పోటీలో

చాలు గొంతు విప్పేస్తారు. ఇంట్లో పాడుకుందుకు అవకాశం ముండదనుకుంటాను వారికి.

"బాగానే ఉంది కంఠం. గట్టిగా పాడు నాయనా..."

"రైల్లో ఏం పాటలెండి..." సిగ్గుపడిపోయాడతను.

"అయ్యో! పాటకిటువంటి పట్టింపులుండకూడదు. వారి కెలాటి సంకోచాలూ సందేహాలూ ఉండేవికావు. జండాపై కపిరాజు అందుకున్నారో—కళ్ళముందు కదనరంగం కదలవలసిందే. మేఘమల్హార్ ఆలపించి చినుకులు కురిపిస్తే—దీపకరాగం పాడి దీపాలు వెలిగించమన్నారుట. సరే నన్నారీయన ఎంత విద్వత్తు లేకపోతే సాక్షాత్తూ పిఠాపురంరాజావారు తన మెడలో పచ్చల హారంతీసి వీరి మెడలో వేసి మెచ్చుకోలుగా నవ్వుతారు?" బోసినోటితో నవ్వింది బామ్మ.

అతని సంగతేమోకాని నాకు మతిపోయింది. తాతగారింతటి సంగీత విద్వాంసులా? పిఠాపురం రాజావారిచ్చిన పచ్చల హారంలో మచ్చుకొక్క పచ్చయినా మిగల లేదేం యింట్లో?

"వారి పేరేమిటి బామ్మగారూ?" అడిగాడు పాటగాడు కుతూహలంగా.

"భార్య—భర్త పేరు చెప్పవచ్చునా?" అనేసింది బామ్మ.

నేను ఆలోచిస్తున్నాను. సంగీతం వంటి లలిత కళలు వంశ పారంపర్యా వస్తూంటాయంటారు. తాతగారింతటి సంగీత సామ్రాట్టులు కాగా—మా నాన్నకి కానీ నాకు కానీ బాత్‌రూమ్ హమ్మింగయినారాలేదేం? రైలు పరుగెడుతుంది. ఏదో స్టేషనువస్తే ఆగింది. ఈసారి బామ్మ పక్కసీటులోకి తమాషా అయిన ఆసామీ వచ్చాడు. ఇనప గుండులా ఉన్నాడు. ఆ గుండ్రపాటి మనిషిని చూస్తూంటే నవ్వొస్తూంది.

"కుస్తీ పోటీలకా?" అడగనే అడిగింది బామ్మ.

"పోటీలకు కాదుకానీ అటువంటి పనిమీదేలెండి. మీరెలా కనుక్కున్నారూ?" ముఖమంతా ఆశ్చర్యం చేసుకుని అడిగాడు వస్తాదు.

బామ్మ ఉలవోకగా నవ్వింది. "వారు బతికిన రోజుల్లో పెరడంతా వస్తాదులే కాదూ? పెరట్లో యిసుక పోయించనూ కోమ సింగాల మాదిరి కుస్తీలు పట్టనూ, రోజంతా అదే కదా? ఆ మహారాజు తన దగ్గరకి విద్య నేర్చుకుందుకు వచ్చిన వారికి నేర్పకుండా పంపేవారు కాదు. వారి మట్టుకు వారు—ఎలా ఉండేవారని? ఆజానుబాహుడు. గుండెమీద కండల్లో పులిగోరు పతకం కనపడేదికాదు పట్టి పట్టి వెదికితే తప్ప. ఆ కంఠమో? పిడుగులు పడ్డట్లే. జబ్బ చరిచి హుంకరించారంటే—ఎదుటివాడు అబ్బా అనవలసిందే. వారిని కట్టుకుని కాపురం చేసిన యిల్లాలినా? పరాకున చూస్తే నేనే బెదిరి పడేదాన్ని. అటువంటి విగ్రహం. ఓసారింటు కోడి రామ్మూర్తి.... కొత్త పట్టు పట్టి ఓ సారి తని కుయిక్కు మనిపించారుట..." ఒకపట్టాన తేరుకోలేక పోయాను. నేను విన్నది-బామ్మ చెప్పింది నిజంగా నిజమేనా? తాతగారు-కోడి రామమూర్తినే కుయిక్కు మనిపించగలిగినంతటి ఘనమైన కాటా కుస్తీ వస్తాదా? గుండెల కండలలో బంగారు పతకమే కనిపించేది కాదూ? మరి-నాన్నగారూ, నేనూ ఎందుకని ఎండు నక్కలలా బక్క ప్రాణులలా ఉన్నాం? ఇక్కడ జనటిక్స్ (జన్యుశాస్త్రం) ఫెయిలయిపోయిందా? ఓ మోస్తరు పర్సనాలిటీ అయినా రాలేదేం మాకు? మందు (బలవర్ధక టానిక్....వాడి చూడుడు. ఒక పౌను మందు తిన్నాక మీ శరీరం బరువు చక్కగా పెరుగును. పథ్యములేదు) వాడక మునుపు అంటూ వేసే నీరసాకార బొమ్మల్లా, బక్క ప్రాణుల్లా ఉండిపోయామేం మేము, తాతగారంత దుక్కగా ఉండినట్లయితే?

"ఆ మహారాజు పేరేమిటవ్వగారూ?"




శ్రద్ధగా అడిగాడు వస్తాడు.

"కులసతి పతిపేరు చెప్పవొచ్చునా? నేరం కాదూ? పాపం కాదూ?"

రైలు వేగం తగ్గించుకుంటూంది. నేను డోరుదగ్గరికి దారి వెతుక్కున్నాను. నేను కాఫీగతప్రాణిని బామ్మకి మడీ ఆచారమూ పుష్కలం కనుక ఆవిడ మంచినీళ్ళయినా తాగదు రైల్లో. రైల్లో ఉండగా ఏ ద్వాదశో వచ్చిందో - ప్లాట్ ఫారంమీద చుట్టూ బట్ట కట్టేసి-వంట వండేసి-బ్రాహ్మడికి భోజనం పెట్టేస్తుంది. అంత నిష్టా, నియమమూను.

కాఫీ తాగి సిగరెట్ కాల్చుకుని పెట్టెలోకి వచ్చాను. ఈసారి బామ్మపక్కన తెలుగు మాస్టారివంటి ఆకారం కూర్చుని వుంది.

"కవిత్వం చెప్పేవాడివా బాబూ? అడిగానని ఏమీ అనుకోకు ఆ పంచెకట్టూ కండువా వాటమూ చూస్తే అలా అనిపించింది."

"అనుకునేందుకేముందండీ? పెద్దవారు. మీ నోటి దీవెన ఫలిస్తే అదృష్టవంతుడినే. ప్రయత్నించగా పాండిత్యం పట్టుబడింది కాని కవిత్వం చేరువ కావశంలేదండీ"

అన్నాడతను ఎంతో దిగులు పడిపోతూ. అతని గొంతులో నిరాశా నిస్పృహా.

"పాండిత్యం దారి వేరూ, కవిత్వందారి వేరూ. కవిత్వం సహజంగా అబ్బవలసిందే సరస్వతీ కటాక్షంగా. వసంతం వచ్చేసరికి కోయిల కూత పట్టినట్టు రావాలి కవిత్వమంటే. ఆ మహానుభావు డేమంత చదివారని? కాని-పంచరత్నాలయినా ఆయనే రాయాలి, పదాలయినా ఆయనే అల్లాలి. అంతెందుకు? నేను కొత్త చీర చుట్టుకున్నానో, ఆయన నామీదా నా చీర మీదా వర్షంగా పద్యాలు కురిపించేవారు. ఓసారి ఆవడలు చేశాను. అవంటే వారికి మహా ప్రీతి ఆవేళ అవి మహా భేషుగ్గా కుదిరాయి. దానితో-ఆవడ నోటిలో పెట్టుకున్నారో లేదో ఐదు పద్యాలు చెప్పేరు ఆశువుగా"—"కవిత్వమంటే అదీ!" అని ముక్తాయింపు పలికింది బామ్మ.

"ఔను బామ్మగారూ... కవిత్వమంటే అలా ధారాపాతంగానే రావాలి. వారి నామధేయం సెలవివ్వండి. రోజూ తలచుకుంటాను అలాగయినా నేను కవిని కాగలుగుతానేమో...."

"భర్తపేరు చెప్పడం ధర్మశాస్త్రం ఒప్పదే...."

నాకు మతిపోయింది. తాతగారంతటి మహాకవులయితే ఇంట్లో ఒక్క గ్రంథమూ లేదేం వారు రచించినది? కవిత్వం-మాకబ్బ లేదేం? కావ్యాలమాట దేముడెరుగు, కనీసం మినీ కథయినా వ్రాయలేదే నేను! నాకో నాన్నకో కవిత్వపు వాసన తాతగారినుంచి ఎందుకు సంక్రమించలేదు? బామ్మనడగాలి ఈ తిరకాసేమిటో. అసలీతాతగారేమిటి? నవలా హీరోకంటె కూడా సకల లక్షణ సమన్వితులై విరాజిల్లుతున్నారు? ఆయనలో లేని గొప్పతనం కనిపించడంలేదు. కవిత్వంలాటి లలిత కళలకి, కుస్తీలాటి అలలిత కళలకి కూడా నిలయమై పోయారు చిత్రంగా! ఇది సాధ్యమేనా? సత్యమేనా?

స్టేషనులో రైలాగింది ఇది-మీల్స్‌స్టేషన్ దగ్గరగా అరగంటాగుతుంది రైలు. దిగి.... భోజనమూ, కిళ్ళీ, సిగరెట్టూ వగైరా కార్యక్రమాలు పూర్తి చేసుకని యీసారి బామ్మ పక్కసీటు కెటువంటి వాడు వస్తాడో అనకుంటూ పెట్టెలోకి-సీటు దగ్గరికి వచ్చాను.

బామ్మ కంఠం కంగుమంటూంది "ఈ మాత్రం దానికి పొరుగూరు వెళ్ళి తగు మనుషులని తెచ్చుకోవాలా? ఊరు గొడ్డుపోయిందా? ఆ మహారాజు తెల్లారి లేస్తే తొంభయి తగవులు తీర్చేవారు. ఆలుమగల తగవే కానీండి.... అన్నదమ్ముల గొడవే కానీండి ... ఆస్తి పంపకాలే అవనీండి. నోటి కొచ్చిన కూత కూయడం కాదే, తగువు విప్పారంటే తరతరాలుకి మళ్ళీ తలెత్తడమే? ఎటువంటి గడ్డు పరిస్థితయినా చిటికెలో విడగొట్టేసేవారు కాదూ? ముఖం గంటు పెట్టుకుని వచ్చినవాళ్ళు ముసి ముసి నవ్వులు నవ్వుతూ వెళ్ళవలసిందే. వారున్నంత కాలమూ అటు పాతిక గ్రామాలూ యిటు పాతిక గ్రామాలూ కోరటు కెళ్ళడం ఎరుగుదురా? ఆయనొక్కరే పది కోరటులూ వంద జడ్జీలూ పెట్టుగా ఉండేవారు-" —"మళ్ళీ ఆయనేమన్నా ధర్మశాస్త్రాలు చదివారనా యింగిలీసు పుస్తకాలు చదివారనా? వివేకంనాయనా....వివేకం "

తాతగారి టోపీలో మరో తురాయి! ఆయన-కొమ్ములు తిరిగిన తగు మనిషి. ఉన్నచోట కోర్టులక్కరలేదు. తాతగారంటే-డేనియల్ కమ్స్టటు జడ్జిమెంట్. బాగానే ఉంది కాని-ఒక్కమనిషి యిన్ని రంగాలలో యిలా సాటిలేని మేటి కావడం సాధ్యమేనా? మా నాన్నగారూ, నేనూ తాతగారి వంశంలో తప్పబుట్టామా? ఒక్క మంచి లక్షణమూ మాకు రాలేదేం? ఆలోస్తూంటే నాకు నిద్ర పట్టేసింది. నిద్రపడితేను మనిషిని కాను. ఒళ్ళెరక్కుండా పడుకుంటాను, మెలకువనేది ఎప్పుడో దానిష్టం వచ్చినప్పుడు రావలసిందే అది నా ఆధీనంలో ఉండదు.

నేను మేలుకునే సరికి.... తిరుపతి దగ్గర పడుతూంది. మరొకటో రెండో స్టేషన్లు. అంతే. బామ్మ సీటువేపు చూశాను. దృష్టి మరల్చుకోలేక పోయాను. బామ్మ పక్కన ఓ బంగారు బొమ్మ. ఆమె పక్కన ఓ పెద్ద మనిషి-ఎందుకో ముఖం వేలాడేసుకుని. బామ్మ అతన్నడుగుతుంది.

"ఇంత చక్కని చుక్కని కని-నీకెందుకు దిగులు?"

"ఈ చక్కని చుక్క గురించే నండి ... దీని పెళ్ళి మాకో విడని చిక్కయి కూర్చుందండీ మామ్మగారూ." ఏమిటన్నట్లు ముఖం సాగదీసి చూసింది బామ్మ.

"ఈ చుక్కకి కొంచెం తిక్కకూడా ఉందండి. పెద్దలు....మీదగ్గర దాచక్కరలేదు...ఇది-పైకి ముంగిలా అమాయకంగా కనిపిస్తుంది కానీ మహా అసాధ్యురాలంటే నమ్మండి."

"ఏమీ"

"ఇప్పటికో పాతిక సంబంధాలు తిరక్కొట్టేసిందండి ..."

బామ్మ బంగారు బొమ్మ వేపు చూసింది.

"నిజమేనా? నీకు పెళ్ళాడి పిల్లణ్ని కని ఎత్తుకుని జోలపాట పాడాలని లేదూ?"- "ఆ యీడు వచ్చిందే నీకు!"

పెద్దాయన చటుక్కున కలగజేసుకున్నాడు. "ఆరోజుకోసమే మేమూ ఎదురు చూస్తున్నామండి ఎంతో యిదిగా. మరి.... దీనివన్నీ గొంతెమ్మకోరికలు- పెళ్ళికొడుకు మన్మథుడిలా ఉండాలంటుంది-"

ఇంక ఆగలేనట్లు—రోషంగా అంది బంగారు బొమ్మ. "మన్మథుడు కాదు. మనోజ్ కుమార్"

నేను త్రుళ్లిపడ్డాను. నిద్రమత్తు వదిలి పోయింది. ఈ అమ్మాయి-చిత్రంగా-మనోజ్ కుమార్ ఫ్యానా! తమాషాగా వుందే.

"తప్పేముంది? అమ్మాయి అధిక చక్కనిది. మొగుడు అందగాడై వుండాలని కోరుకోడం సహజమే తప్ప నేరం కాదు." అమ్మాయిని దగ్గరగా తీసుకుంటూ అంది బామ్మ.

"అంతే అయితే బాధ లేదండి. అక్కడితో ఆగిందా? కాబోయే మొగుడు కథ వ్రాయాలిట. క్రికెట్టాడాలిట. పాటలు పాడాలిట. డ్యాన్సు చేయాలిట. అతని అందముండాలిట. ఆస్తులుండాలిట. ఒక టేమిటండి. అతడు సకలగుణాభిరాముడై ఉండాలి. అటువంటివాడు భూమ్మీదుంటా డంటే నమ్మతేమండి. ఒకవేళ ఉన్నా-నే నివ్వగలిగే పదివేలకి దొరకడండి-" దీనంగా చెప్పాడా పిల్ల తాలూకు తండ్రి.

అమ్మాయి తక్కువ తిన్నట్లు లేదు "ఎందుకుండదేం? నేన్చదివిన నవలలలోనూ చూసిన సినిమాలలోనూ హీరోలందరూ అలాంటివాళ్ళే. భూమ్మీదుండరనేస్తే నేన నమ్ముతానేమిటి"

నేను గతుక్కుమన్నాను. పెళ్లి చేస కునే ఆడపిల్ల కిన్నేసి కోరికలుంటాయన్న మాట పెళ్లిమీదా పెళ్లికొడుకుమీదా నయమే. నేను చటుక్కుని తొందరపడ

# యదార్థం

**ఒంటరి సాయంత్రాలు,**
**వెన్నెల నిమరగా**
**చల్లగా వీచే చెట్టుకొమ్మలు.**
**గొంతులు తడిపే చల్లని—**
**వేడి పానీయాలు**
**ఊహా లోకాల్లోకి నడిపించే**
**సంగీతాలు**
**దేవాలయాల్లో భజగోవిందాలు**
**క్లబ్బుల్లో డిస్కో- డాన్సుల**
**కేరింతలు**
**ఎంత మందికి అనుభవంలో**
**ఒక భాగం?**
**కొందరికి ఇదంతా యథార్థమే!**
**మరి మిగతా కోట్లాది మందికి**
**వెలుగు-చీకటి అంతా ఒకటే!!**

**నిఖిల్**

పెళ్ళి చేసుకుందుకు సిద్ధపడిపోలేదు.

ఒక్కసారి బామ్మ ఫక్కున నవ్వింది.

బంగారు బొమ్మని దగ్గరకు తీసుకుని. మరీ మరీ నవ్వింది. అలా నవ్వుతూనే-"ఓసి వెర్రిపిల్లా! పిచ్చినాన్నానీ... నీ చిన్ని మనసులో ఎన్నెన్ని కోరికలే. నీ అమాయకత్వం బంగారం కానూ" అంటూ ఆ అమ్మాయి బుగ్గలు పుణికింది మునివేళ్ళతో.

"నావన్నీ కలలేనా?" అడిగిందా అమ్మాయి బెదురుగా.

"కాదుకాదు. కలలు కాదు. నీ కలలు నిజమౌతాయి"

"ఎలా?" ఆశగా చూసింది.

బామ్మ గంభీరంగా అయిపోయిందొక్కసారి. ఓ నిముషం మౌనంగా-ఆలోచిస్తున్నట్లుండి-ఆలోచనా భంగిమ నవలంబించి-అప్పుడు యిలా అంది. "జాగ్రత్తగా విను. విన్నది మనసుకి పట్టించుకో. మన ఆడవాళ్ళకి పార్వతీదేవి ఓ వరమిచ్చింది. అదేమిటంటే-ఉన్నా లేకపోయినా ఊహలలో బతికెయ్యగలిగే సమర్థతా చాతుర్యమూ...."

"మనసు చంపుకోడమా?" అడ్డం తగిలింది పెళ్ళికాని పిల్ల.

"పెంచుకోమనే. చంపుకోమని కాదు. మొగుడెటువంటివాడు కానీ మన కంటితో చూడ్డమూ మన మనసుతో తూచడమూ నేర్చుకుని అలవాటు చేసుకుంటే అంతా సుఖమే మనకి. ఆడజన్మ కిది అత్యావసరమయిన లక్షణం. చూడగలిగిన కనులకు కురూపి భర్త కూడా నలకూబరుడే అవుతాడు. గుమాస్తా కూడా ఇంద్రుడే అనిపిస్తాడు. అతని తిట్లు కవిత్వంలా వినిపిస్తాయి. కోపిష్టి మొగుడు కూడా పరమ పురుషుడిగా తోచి తీరుతాడు. అనగ నగ రాగ మతిశయిల్లదూ? తినగ తినగ వేము తీపి కాదూ? పాతిక రూపాయలకు కొన్న చీరను-పక్కింటావిడకు యాభై అని చెప్పి మురిసిపోగలిగే మనసు కాదూ ఆడమనసు? చీర గురించి అతిశయోక్తి చెప్పి ఆనందించగలిగే మనం-మొగుడి గురించి ఉన్నవీ లేనివీ చెప్పుకుని మురిసిపోడం మాత్రం తప్పేమిటి? ..." ఇంకా ఏదో చెప్పింది బామ్మ బహు సీరియస్‌గా.

తాతగారి గురించి నా సందేహాలకు సమాధానాలు దొరికేశాయి

అమ్మ బామ్మా! నువ్వింత తెలివయినదానివా అనుకున్నాను మనసులో.

చచ్చినవాడి కళ్ళే కాదు, బతికున్నవాడి కళ్ళూ చారెడే-అతగాడేఆడదానికయినా భర్తఐతే భారతదేశపు భర్త అత్యంత అదృష్టవంతుడు. ఇల్లాలి అంతరంగంలో అతను ఎప్పటికీ ది గ్రేట్! 

# ఒక చెల్లని రాత్రి

## యామినీ సరస్వతి

"హలో! హలో! హలో !!"

మౌత్‌పీస్ పట్టుకున్న రజిత అలాగే ఆ పిలుపు వింటూ వుండి పోయింది. ఆ పిలుపు ఆమె చెవుల్లో ఝుమ్మని ప్రతిధ్వనించింది

"హలో రజితా!"

పలకాలనిపించ లేదామెకి.

"హలో ఎవరండీ ఆవైపు! రజితని పిలవండి! నేను జితేంద్రని!"

"నేను.... నేను..."

అస్పష్టంగా పలికింది రజిత గొంతు.

"హలో రజీ! పిలుస్తున్నా పలకవేం! నిన్ను పిలచినంత సేపు ఆ దేవుడిని పిలిచినా పలికేవాడే!"

"................"

"హలో జితా!"

"అవును నేను జితనే! నీ చేత జయింపబడ్డాను. కనుక క్షమించు నేను రాలేను...."

"ఆగు. రజీ! ఫోన్ పెట్టెయ్యొద్దు..వన్ మినిట్ ప్లీజ్.......ఈ రోజు మేనకాలో డీలక్స్ టికెట్స్ బుక్ చేశాను. మంచి ఇంగ్లీష్ పిక్చర్...."

"స్టాపిట్ ఇంద్రా! ఇంగ్లీష్ పిక్చర్స్, మళయాళం పిక్చర్స్ నేను చూడదలచుకోలేదు!"

"ఏమైంది? ఏమైంది రజితా నీకు? ఆర్ యు హర్ట్? నేనేం చేశాను, ఈ దాసుడి తప్పేదైనా వుంటే మనసారా మన్నించు. లేకపోతే జడతో కొట్టు-కట్టు. లేదా కాలిలో అట్టి పెట్టు-ఒట్టు పెట్టు-అంతే కానీ నాతో కలవకుండా నాతో మాటాడకుండా నాతో ప్రోగ్రాంకి రాకుండా బాధ పెడితే ఈ రజితేశ్వరుడు భరించలేడు. ఈ వియోగంతో చచ్చిపోతాడు....

ఆఫ్ కోర్స్-చచ్చిపోతే సలీం, మజ్నూ దేవదాసుల్లిస్టులో చేరిపోతాననుకో-నాకేం బాధలేదు-తనువు శాశ్వతం కాదు. కానీ ప్రియే! చారుశీలే! నీ నుండి దూరం కావటమే దారుణం...."

"జీన్! యిలాంటి మాటల మత్తులో పడేసే కాలేజి మొత్తం మీద ఆటంబాంబనిపించుకున్న నన్ను ఫ్రెండ్‌ని చేసుకున్నావ్!......."

"థాంక్స్! థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్...."

"చారుశీలే అన్నావు కదూ! అదో అందుకే నేను నీకు దూరంగా వుండాలనుకుంటున్నాను"

"దూరమా?"

"అవును వినిపించనంతదూరం-కనిపించనంత నేను స్టేట్సుకి వెళ్ళిపోతున్నాను.... తెలుసా?"

"ఈజిట్? నిజమా! రజీ! నిజం చెప్పు-ఎందుకీ దబాయింపు? నేనేం తప్పు చేశానని నాకీ శిక్ష? నీకంత ఫారిన్ వెళ్లాలనుంటే చెప్పు నెల తిరక్కుండా మిస్టర్ ఎండ్

మిసెస్ జితేంద్రలకి, ఫారిన్ టూర్ ఏర్పాటు చేస్తాను!"

"..........."

"హల్లో! పలకవేం రజీ!"

"మైడియర్ ఫ్రెండ్! కారిడార్‌లో మా నాన్నగారి పదధ్వని వినిపిస్తుంది. ఫోన్ పెట్టెయ్."

"ఒకే! ఇదో ఓ ముద్దు పడేస్తున్నా! సాయంకాలం-ఆరింటికి-మేనక-ఇంగ్లీష్ పిక్చర్ మరవద్దు....... ప్చ్........"

"ప్చ్ .." అప్రయత్నంగా ప్రతిధ్వనించింది రజిత

"థాంక్స్!"

అవతల క్రెడిల్ చేసిన శబ్దం విని ఒరుపుగా నిట్టూర్చి ఫోన్ పెట్టేసింది రజిత.

మరో ఆయిదునిమిషాలకి కోటీశ్వరరావు వచ్చేశాడు అక్కడికి. సోఫా సెట్‌లో కూర్చుంటూ, "ఎక్కడిన్నించమ్మా ఫోన్?!" అన్నాడు.

"నాగర్ల్ ఫ్రెండ్ నాన్నా"!

"ఇక యీ గర్ల్ ఫ్రెండ్స్‌నీ బాయ్ ఫ్రెండ్స్‌నీ కాస్తదూరంగావుంచాలమ్మా?"

"ఎందుకు నాన్నా?"

"మీ బావ వచ్చే వారం వస్తున్నాడమ్మా! బోంబేకి వెళ్ళి రిసీవ్ చేసుకుని రావాలి. అతను రాగానే రిసెప్షన్. అది కాగానే మీ పెళ్ళి అంతే!"

రజిత గుండె గొంతులోకి వచ్చినట్లయింది.

"నాన్నా!" అంది తడబాటుతో.

"అదంతే నమ్మా! మీ అమ్మ చనిపోతూ నాతో మాట తీసుకుంది. ఈ పెళ్ళి జరిగితీరుతుందని మాటిచ్చాను. అంచేత అతనొచ్చేదాకా ఎలా తిరిగినా—అతనొచ్చాక అతనితో నే తిరగాలి. అంతే!"

"అమెరికా నుంచి వస్తున్నా బావలో మార్పురాదా నాన్నా! ఫ్రెండ్‌షిప్‌ని గౌరవించ లేడా?"

"అమెరికా నుంచి వస్తున్నా-ఆస్ట్రేలియా నుంచి వస్తున్నా—లండన్ నుంచి నేరుగా దిగినా మగాళ్ళ మనస్తత్వ మంతే నమ్మా! అమెరికాలో చదివి ఉద్యోగం చేస్తున్నా పుట్టింది యిక్కడేగా! కాబట్టి అంతేనమ్మా!"

రజిత జవాబివ్వ లేదు.

"నువ్వయినా యిక ఫ్రెండ్‌షిప్ తగ్గించు. ఏదో యిక్కడ వుండి కాలేజీలో చదువుతున్నావు కాబట్టి కంపెనీకి ఫ్రెండ్స్ అవసరం—ఎలాగూ నెల నాళ్ళలో స్టేట్స్‌కి వెళ్ళబోయేదానికి యీ ఫ్రెండ్స్ ఎందుకమ్మా-ఇదంతా చెత్త. వీలయితే నెలకో రెన్నెల్లకో అమెరికాకి కేబుల్ కొట్టగల ఫ్రెండ్స్‌ని సంపాదించుకో-అది గౌరవం!"

నిట్టూర్చింది రజిత, "ఈ దేశమే కాదు-ఏదేశమేగిన ఆడదానికి నిర్పులు తపట్ట్వావు-పెళ్ళి కాకపోతే బ్రహ్మాండం పగిలి పోతుందనేట్టుగా భయపడతారు అంతా! పెళ్ళయితే ఒట్టి బానిసత్వం! ఆంధ్రాలో పశువులకాసే వాడయినా, అమెరికాలో రిసెర్చి చేసే డాక్టరయినా ఒకటే-మన స్తత్వం!" అనుకుంది.

"అంచేత రజితా! బి ఏ గుడ్ గర్ల్!" అని సోఫాలోంచి లేచాడు రావు. సోఫా తగ్గిన బరువుకి బరువుగా మూల్గింది.

o o o o

సాయంకాలం అయిదు యాభై!

ఇంపాలా కారుకి ఆనుకుని అరగంట నుంచి అసహనంగా ఎదురు చూస్తున్నాడు జితేంద్ర. సరిగ్గా ఆరు గంటలకే రమ్మన్నా ఆడవాళ్ళ మనస్తత్వం బాగా తెలిసిన వాడు కాబట్టి ఒక వేళ అయిదున్నరకే వస్తుందేమోనని అంత కంటె ముందుగానే వచ్చాడతను.

అతని మనస్సులో ఏవేవో ఆలోచనలు. ఎన్నెన్నో ఊహాలు!

"హాయ్!"

ఆ పిలుపుకి ఉలికి పడ్డాడు జితేంద్ర

ఎదురుగా నవ్వుతూ సరిత!

"పిక్చర్ కా"?

"ఊహుఁ" అన్నాడ ప్రయత్నంగా.



"బావుంది. నా ప్రశ్న తలతిరుగుడుగా వుంది. నీ జవాబు తల తిక్కగా వుంది. థియేటర్ ముందు నుంచుంటే సినిమాకి కాదని ఎలా అనుకుంటాను. కమాన్ వెడదాం పద! మంచి కంపెనీ!" అంది తమాషాగా చిన్నగా నవ్వుతూ.

"సారీ! సినిమాకి కాదన్నానా? ఎదురు షాపుకి పర్చేజింగ్‌కి ఓ ఫ్రెండ్ వస్తుంది. అందుకే యీ వెయిటింగ్!"

"ఎవరా ఫ్రెండ్? రజితేనా?"

జవాబివ్వలేదు జితేంద్ర.

"జిన్! మత్తెక్కించే నీ మాటలు వింటూ మత్తు నెదజల్లే నీ కళ్ళల్లోకి చూస్తూ నా బతుకులో ఎన్నో రోజులు గడిపాను. నాతో తిరిగినన్నాళ్ళూ నేనే లోకం అన్నావు-నన్నే పెళ్ళి చేసుకుంటానన్నావు, చివరికి నీ యాక్సిడెంటుతో నేను హాస్పిటల్లో మూడు నెల్లు రెస్టు తీసుకుని వచ్చేసరికి నువ్వు అప్పుడే కాలేజీలో అడుగు పెట్టినట్టుగా రజిత వెంట పడ్డావు. ఇది అన్యాయం!"

"షటప్!"

"జిన్!" దీనంగా పిలిచింది సరిత.

"ఇదిగో టికెట్స్! ఇదిగో వంద! ఇప్పటికి నన్ను వదిలేయ్!"

"అదా విషయం! ఇంతేనా నన్ను అర్థం చేసుకుంది నువ్వు, సారీ! నాకేం అక్కర్లేదు. ఆ మాట కొస్తే నువ్వు మాటకు కట్టుబడి నన్ను పెళ్ళి చేసుకో నక్కర్లే. నీ యిష్టం రజితనే చేసుకుంటావో స్వర్ణనే చేసుకుంటావో! నే నెందుకు అడ్డు పడాలి. కానీ నన్ను నీ గర్ల్ ఫ్రెండ్‌గా జీవితాంతం గుర్తిస్తే చాలు. ఇలాగే మేరేజ్ లేకుండా వుండి పోతాను".

"బోర్! పూర్ సరితా! నీ చాప్టర్ అయిపోయింది. వెళ్ళు!" అని కారెక్కి స్టార్టు చేసి ముందుకి దూకి చాడు.

పళ్ళు కొరుకుతూ నిలుచుండి పోయింది. సరిత! "డామిట్! చూస్తా ఎన్నాళ్ళిలా సాగుతుందో! రేపు రజిత నాన్నకి నీ గురించి ఫోన్ చేస్తే సరి! కిళ్ళు విరిపిస్తాడు-మంచ మెక్కితే మనం గుర్తుకొస్తాం దొరగారికి!"

o o o o

రజిత యింటి నుంచి మేనక థియేటర్‌కి వచ్చే దారిలో కారు నాపుకుని వుండి పోయాడు జితేంద్ర.

అప్పుడు సరిగ్గా ఆరూ పదిహేను!

సినిమా ఎలాగూ తప్పి పోయింది. మరో పది నిమిషాల్లో రజిత వచ్చేసింది. ఏం చెప్పాలి? ఎక్కడికి తీసికెళ్ళాలి. అసలు తన ప్లాను వేరు. ఈ 'హాట్' పిక్చర్ చూపించి, వేడెక్కిన రజితని తమ గెస్ట్ హౌస్‌కి తీసి కెళ్ళాలను కున్నాడు సరిత వచ్చి అంతా అప్సెట్ చేసింది

రజిత వస్తుందా?

రాక పోతే!

తిరిగి థియేటర్ కి వెళ్ళి సరితను కాల్ చేస్తే!

ఊహుం ఇక సరితని మరిచిపోవాలి.

ఆ అమ్మాయి లాభం లేదు. పిల్లది పిరికిదై పోయింది. చాలా డేంజరస్ అమ్మాయి, ఈ సారి ఆమె జోలికి వెళితే వాళ్ళ నాన్నా తమ్ముళ్ళు కలసి బలవంతంగా తనతో తాళి కట్టిస్తారు.

మొగాడ్! సరితని భార్యగా భరించగలడా?

"ఊహుం"

ఉలిక్కిపడ్డాడు జితేంద్ర.

అప్పుడే చూశాడు వేగంగా నడచి వస్తున్న రజితని.

కారుముందునుంచే చకచకా నడుస్తూ తలవంచుకుని వెళ్తున్న రజితని చూసి 'రజితా!" అన్నాడు.

కారు దాటి వెళ్ళబోతున్న రజిత ఉలిక్కిపడి ఆగింది. "ఇక్కడున్నావా?" అంది.

"ఎక్కు!"

"అదేకదా థియేటర్!"

"లేదులే! కారు ఎక్కెయ్'

"ఎక్కడికి?"

"చెప్తాగా!"

ఓ క్షణం తటపటాయించి కారెక్కింది. వెంటనే బయలుదేరింది కారు. అయిదు నిమిషాలు పరిగెత్తి ఊరు బయట తోటవద్ద ఆగింది.

"ఎలమావితోట!"

"ఆం బ్రతుకే ఎలమావితోట మనకి!"

"ఊహూం నీకే"

"అదేం?"

"అదంతే! నువ్వు నిత్య వసంతుడివి!"




నవ్వేడు జితేంద్ర! కారు దిగేడు. అతని వెంటే కారు దిగింది ఆమె. మెల్లగా నడుస్తూ వెళ్ళి లోపలి బంగళాముందు ఆగేడు.

"జిన్, మీ నాన్న శేస్తున్నవాడు! రమేష్‌గారు రం అయితే నువ్వు జిన్. రం, జిన్ రెండూ యిచ్చేంత నిషానిని మీ పేర్లూ, యీ తోటా యిస్తాయి."

పకపక నవ్వేడు జితెన్. రజిత నడుం చుట్టూ చేయేసి ముందుకి నడుస్తూ "ఆ మాటకొస్తే నీ పేరు పెట్టిన మీ నాన్న దూరదృష్టిని మెచ్చుకోవాలి మనిద్దరి పేర్లూ మనకంటే ముందుగానే కలిశాయి!" అన్నాడు

షార్ప్‌గా నవ్వింది రజిత.

తర్వాత కబుర్లు ...పేకాట.....షటిల్ కాక్....మ్యూజిక్... పార్టీ.... మందూ.... గంటలు నిమిషాల్లా గడిచిపోయాయి.

వసంత రుతువులా కాలం గడిచాక దాదాపు రెండుగంటల వేళ దిగని మత్తుతో, నిషాతో వాలిపోతున్న కళ్ళతో, సరికొత్త అనుభవం యిచ్చిన హాయితో తేలిపోతున్న శరీరంతో, గేట్లో దింపేసిన జితేంద్రకి టాటా చెప్పి తన గదికి వెళ్ళి పడుకుంది.

ఆమె రాకని ఎవరూ గమనించలేదు.

○ ○ ○

సరిగ్గా పై సంఘటన జరిగిన వారం రోజులకి హైద్రాబాద్ బేగంపేట విమానాశ్రయంలో బావని రిసీవ్ చేసుకుంది రజిత.

"హాయ్! ఎలా వున్నావ్?" మెరుస్తోన్న కళ్ళతో అడిగేడు శరన్. విమానంలో వెంట వచ్చిన మామకానీ, తండ్రి కానీ అక్కడున్నారనే ధ్యాస కూడా లేకుండా రజిత భుజంపై ఓ చేయి, నడుం చుట్టూ మరో చేయి వేశాడు.

తెల్లటి శరీరం, మెరుస్తోన్న కళ్ళు, ఎత్తరితనం, నాగరికత నేర్పిన వాకింగ్ స్టయిల్ కొంచెంసేపు సమ్మోహితం చేసింది రజితని.

"ఫైన్!" అంది సింపిల్‌గా.

"వాట్ ఎ స్వీట్ వాయిస్!" అన్నాడు ఎడ్మైరింగ్‌గా.

"థాంక్స్!"

కారుదగ్గరికి వచ్చారు ఫార్మాలిటీస్ ముగించుకుని.

"నేరుగా మన వూరు వెళదాం!" అన్నాడు రావుగారు.

"నో! మామాజీ. ..నేను యిక్కడ రెండు రోజులు ఆగాలి. ఆ తర్వాతే మన వూరు. అంతగా మీకు అర్జంటయితే వెళ్ళండి....నేనూ రోజ్ రెండురోజులు యిక్కడ గడిపి వచ్చేస్తాం!"

"లేదులే! మేమూ వుంటాం యిక్కడే!" అన్నాడు అతని తండ్రి.

"అలా అయినా మీరో హోటల్లో దిగండి! నేనో హోటల్లో దిగుతా! రోజ్ నాకు కంపెనీ యిస్తుంది!"

రజిత మాటాళ్ళేదు.

"శశాన్! ఇది యిండియా — అమెరికా కాదు. అందునా తెలుగుదేశం! ఇక్కడ పెళ్ళికాని అమ్మాయి - ఎంత బావైనా - మరో మగాడితో తిరిగితే లోకం నలుగురూ నాలుగు మాటలంటారు. ఇక్కడ స్వాతంత్ర్యం వుంది! నాగరికత పెరిగింది! స్త్రీలు రాజకీయాల్లో ఉద్యోగాల్లో ప్రవేశించారు. బాగా చదువుకుంటున్నారు. అయినా యింకా యిలాటి పట్టింపులు-ఆచారాలు మాత్రం పోలేదు!"

"రబ్బిష్!"

"నీ ఫారిన్ కళ్ళకి యిది రబ్బిషే! కాదన్ను. కానీ యిక్కడ అలా ప్రవర్తించటం రబ్బిష్" కొంచెం కఠినంగా అన్నాడు రావు.

"హుఁ కంట్రీ బ్రూట్స్, అయితే ఏం చేయాలిః" పెదాలు బిగించి బొమ్మలు ముడివేసి అతను ఆలోచిస్తూవుంటే ముద్దుగా కనిపించాడు రజితకి....అలా వాళ్ళిద్దరూ తన యిష్టానిష్టాలతో సంబంధం లేకుండా తనని గురించి మాటాడుతూవుంటే తమాషాగా అనిపించింది రజితకి.

ఒక్క క్షణం ఆగి అన్నాడు. "అంకుల్! ఇదో డైమండ్ రింగ్! ఇది రజిత వేలికి పెడుతున్నాను. ఇదే ఎంగేజ్‌మెంట్! అంటే మన దేశంలో నిశ్చితార్థం అనుకో! నేను రజితని పెళ్లి చేసుకుంటాను. దీనికి మీరంతా సాక్షి. ఇదో మినీ టేప్‌రికార్డర్. ఇప్పుడు నేను చెప్పిన మాటలన్నీ రికార్డ్ చేసింది. ఇదీ ఓ సాక్ష్యం. ఇదో ఆటోమేటిక్ కెమెరా! మమ్మల్నిద్దర్నీ ఫొటో తీస్తుంది. ఇంకా ఫొటోలు తీసుకుంటాం. అవీ ఎవిడెన్స్!

ఇక్కడనుంచి రాగానే రిసెప్షన్ ఏర్పాటు చేయండి. అక్కడ మా పెళ్లి విషయం ఎనౌన్స్ చేయండి. తర్వాత ముహూర్తాలు చూసి పెళ్లి చేయండి. అఫ్ కోర్స్! నాకు అలాటి పెళ్ళిళ్ళపై నమ్మకం లేదు. నా ఉద్దేశ్యంలో సివిల్ మేరేజ్ చాలు. కానీ పెళ్ళంటే నా ఒక్కడి అభిప్రాయమే కాదుగా. మీ అందరి కోరికలూ తీరాలి. ఇకపోతే డౌరీ విషయం-

అది నువ్వూ మా డాడీ మాటాడుకోండి!

అమెరికానుంచి వచ్చినా డౌరీ అడుగుతున్నాను అనుకుంటున్నారా? వెలలేని పెళ్లికొడుకు విలువలేని పెళ్లికొడుకే! నువ్విస్తావు. డాడీ పుచ్చుకుంటాడు. ఇందులో తప్పేమిటి? నాకు బోధపట్టంలేదు. పీడిస్తే కదా బాధ! నో బార్గెయినింగ్! నో రేట్స్ బిజినెస్! నువ్వు ఫిగర్ చెప్పు. డాడీ ఓకే చేస్తారు—"

అంతే!

మాటలు ముగించి వెళ్లి టాక్సీలో ఎక్కారు యిద్దరూ.

"బావా! లక్షలకి విలువైన మాట అన్నాడు అల్లుడు! ఎంత డబ్బుపోస్తే యిలాటి అల్లుడొస్తాడు నాకు! వాడిని అమెరికా పంపించి మంచిపని చేశాం మనం. నీ డబ్బు నా పలుకుబడీ వ్యర్థం కాలేదు"

"థాంక్స్! బావా! బేరసారాలు మనకెందుకు. ఇచ్చేదేదో ముందుగానే వాడి ఎకౌంటుకి ట్రాన్స్‌ఫర్ చెయ్!"

"ఎంతయినా ముందు జాగ్రత్త కలవాడివిలే!"

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

**రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన నాలుగు నూనెల సమ్మేళనం—**
హపుషా (దేవదారు జాతి), సరళం. రెక్సోనాతో స్నానం చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా మెరిసేలా ఉంచుతుంది,
మీరెంతో ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై విలిపి గుబాళింపజేసే రెక్సోనా మీ చర్మ సంరక్షణ కోసం ముఖ్యమైన సాధనం.




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లివర్ వారి విశిష్ట ఉత్పత్తి

"అందుకేగా సుపుత్రుడ్ని కన్నాను!"

"అందులో లేదు నీ గొప్పదనం! తగిన జోడీని కన్న మాద అసలైన గొప్పదనం!"

పకపక నవ్వుకున్నా రిద్దరూ.

కారు హోటల్ వేపుగా పరిగెత్తింది.

o o o

విశాలమైన హూటల్ గది!

"అబ్బ! దాహం వేస్తుంది. ఐస్ వాటర్ తెప్పించావా."

"ఐస్ వాటరా? నో! నో! నైస్ వాటర్ యిస్తాను. ప్రయాణం చేసి నువ్వూ నేనూ అలసిపోయాం ఫారిన్ బీర్ తాగుదాం! చల్లబడ్తాయి శరీరాలు!" అని బాగ్‌లోంచి తీసి బీర్ యిచ్చాడు. విజిత బాటిల్ తెరిచి గ్లాసులో పోసి యిచ్చిందతనికి

"లేడీస్ ఫస్ట్!"

"నో థాంక్స్!"

"వై? ఇదేం తప్పుకాదు. హావ్ ఎ సిప్ మై డియర్ బేబీ!"

"బావా! నే నెవరను కుంటున్నావ్?"

"మై స్వీట్ హార్ట్!"

"కానీ నేను నిన్ను పెళ్ళి చేసుకోను!"

పక పక నవ్వేడతను "జోక్! జోక్! వండర్ ఫుల్ జోక్! ఏం నేను తగనా? విదేశాల్లో తాగి తిరిగి చెడి పోయాన ని అనుమానిస్తున్నావా? నో! నో! ఇటీజ్ వెరీ కామన్ టు అజ్!"

"లేదు నేనే చెడిపోయాన-"

"చెడిపోయావా? ఏమిటిది పూలిష్ నెస్! నువ్వేం పండువా? కాయవా? పాలా? పెరుగా? చెడి పోవటానికి డోంట్ టాక్ ట్రాష్!"

"అది కాదు బావా!"

"మరేమిటి?"

"నీకు షాకింగ్ న్యూసే! అయినా చెప్పక తప్పదు. యుసీ నేను జితేంద్ర ఫ్రెండ్సమి. అతను నన్ను లైక్ చేసేవాడు. నేనూ యిష్టపడ్డా నతని స్నేహాన్ని. ఓ రోజు యిలాగే యిద్దరం ఎంజాయ్ చేశాం డ్రింక్సతో-తర్వాత యిద్దరం శారీరకంగా ఏకం అయ్యాం! తర్వాత పెళ్లి విషయ మెత్తితే అఫూల్ నన్ను పురుగుని చూచి నట్టు చూసి పెళ్ళి గిళ్ళి బుష్‌షాక్! నేను నీ లాంటి వాళ్ళందరికీ తాళి కడుతూ వెడితే నూరు తులాల గోల్డ్ కావాలి. శుభ్రంగా మీ బావనో మరో గాడిదనో పెళ్ళి చేసుకో అని వెళ్ళిపోయాడు దాంతో నేను చాలా హర్ట్ అయ్యాను.

నువ్వు నే నంటే చాలా యిష్టపడు తున్నావ్ చిన్నపుడునుంచి. ఫారిన్ వెళ్ళాక కూడా పెళ్ళికి సుముఖంగా వున్నావు నేను నిన్నెలా మోసం చేయ గలను? అందుకే అందుకే జరిగింది చెపుతున్నాన."

శవన్ ఓ నిమిషం మాట్లాడలేదు. బీర్ బాటిల్ ఎత్తి కొంచెం గొంతులో పోసు కున్నాడు

"యు సీ మై ఫెయిర్ లేడీ! అదంతా ప్లీస్ ఫర్గెటిట్. పీడకల అనుకో-కల రావ టంలో మన బాధ్యత వున్నా కలని చూసి జడుచుకోంగా? కలలో జడిసినా మెలకువ వచ్చాక కొంతసేపు మనస్సు పాడైనా తిరిగి అదంతా కల అని కొట్టేస్తాం కదా!

మై డియర్ ఎంప్రెస్! కిందికి చూస్తూ వుంటే మెళ్లో డైమండ్ నెక్లెస్ జారి మురికి ఆ లవలో పడింది! తిరిగి తీసుకోమా శుభ్రం చేసుకోమా?

మై డియర్ బెటర్ హాఫ్! అవన్నీ నీకు వింతగా వుండొచ్చు. ఇంతెందుకు - నువ్వు భారతదేశంలో పుట్టావు-ఈ దేశం ఎగ్జాంపిల్ చెప్తాను. నువ్వు పూజ చేస్తున్నావ్-అమ్మవారి విగ్రహం చేతిలోంచి జారిపడింది.




దాన్ని తిరిగి తీసుకుని కళ్ళకద్దుకుని పూజా మందిరంలో భయంతో - భక్తితో-అలంకరించవూ-ఇదీ అంతే!

కాబట్టి పిచ్చి పిచ్చి ఆలోచనలు వద్దు. లెటజ్ ఎంజాయ్. అది చెల్లని రాత్రి! ఇది చల్లని రాత్రి!

దాన్ని మరచిపో!

ఇది పరువాల పంట!

దీన్ని మనసారా ఎంజాయ్ చెయ్! బ్రతుకంతా తీపి కలగా గుర్తుంచుకో.

పూర్ సెంటిమెంట్స్!

వీటిలో కొన్నిటిని ఎమెండ్ చేసుకోవాలి! తప్పదు.

తప్పు చేయటం వేరు. పొరపాటు చేయటం వేరు! దగా పడటం వేరు. ఈ క్లాసిఫికేషన్ ఇడ్జిమెంటుకి అవసరం!"

అతను చెప్పటం ఆపి ఆమె భుజంపై చేయివేసి దగ్గరిగా లాక్కుని తీయని దొండపండులాంటి ఎర్రని పెదాల్ని అందుకున్నాడు. గాఢంగా చుంబించాడు అయిదు నిమిషాలు ఊపిరి ఆడ్లేదు రజితకి

"బావా!"

"ఊఁ"

"నువ్వు పురుషుడివి కావు!"

"వ్హాట్!"

"అవును-మీరు పురుషులు కారు!"

"ఆఁ"

"ఆఁ పురుషులు కారు! కారు! కారు!"

"మరి?" కంగారుగా అడిగాడు.

"రుషులు! మహా పురుషులు!"

అతనికి తన వ్యక్తిత్వం హిమాలయాల ఎత్తు పెరిగినట్లు అనిపించింది. ఆమెని ఎత్తుకుని ఆనందంతో గిర్రున తిరిగాడు. రజిత కిలకిల కోయిలలాగా నవ్వింది. అతనూ నవ్వు జత కలిపాడు. ఇద్దరి నవ్వులతో ఆ గది ఆ రాత్రి ప్రతిధ్వనించింది. జీవితమంతా నవ్వుల వానే అన్నట్టుగా! ✻

# పొరపాటు

తురగా (మోచర్ల) జయశ్యామల

"బాబూ! నీ కాల్మొక్కుతా! అయిదుగురు బిడ్డల తల్లి. అల్లందరిని తల్లి లేనోళ్ళను చెయ్యకండి, బాబూ!" అంటూ రోగివెంట వచ్చినతను రంగనాథ్ కాళ్ళట్టుకొని బతిమాలాడు.

"చేస్తానయ్యా! చేస్తాను. మేమున్నది అందుకేకదా! మా ప్రయత్నం మేము చేస్తాం. ఆ తర్వాత భగవంతుడి దయ. ముందు యూరిన్ అవడానికి సూదులేస్తాను. గర్భకోశంలో పుండు పడింది. తర్వాత దానికి ఆపరేషన్ చెయ్యాల్సి వస్తుంది!" అంటూ చెప్పాడు రంగనాథ్.

"బాబ్బాబు! నీకు పున్నెముంటది. ఏటి సేసయినా సరే! ఆయమ్మ పానాలు నిలబెట్టు!"

"అలాగే! అలాగే!" అంటూ తలూపాడు రంగనాథ్.

కేసునయితే టేకప్ చేసుకున్నాడుగాని, రోగినిచూస్తే బ్రతుకుతుందన్న నమ్మకం లేదు రంగనాథ్‌కి. పల్లెటూర్లో అన్ని నాటు వైద్యాలు చేసి, యింక లాభంలేక యిక్కడకు తీసుకు వచ్చారు. రోగం ముదిరిపోయి చావు బ్రతుకులమధ్య కొట్టుకులాడుతూందామె. ఆమెకు అదృష్టముంటూ వుంటే తప్ప. ఈ చివరి క్షణంలో ఎంత వైద్యం చేసినా వృథానే. ఆ సంగతి రంగనాథ్‌కి తెలుస్తూనే వుంది. అయినా పైకి అనలేదు.

కారణం. ఆ రోజు ఉదయంనుంచి రంగనాథ్‌కి క్రొత్త కేసేమీ రాలేదు. చేతిలో ఐదు రూపాయలు కంటే ఎక్కువ లేవు. సాయంత్రమవుతూంది. తప్పనిసరిగా క్లబ్బుకి వెళ్ళి తీరాలి. లేకపోతే ముఖం చాటేసాడంటారు మిత్రులందరూ. పైగా క్రిందటిరోజు సాయంత్రం ఎనభై రూపాయల వరకు పోయింది తనది. ఈరోజున బాగా ఆడి తనదే పై చెయ్యి అనిపించుకోవాలి. 'ఆరీనురాణి' కళ్ళముందు కదులుతుంటే, ఆ కేసు తనవల్ల కాదని చెప్ప లేకపోయాడు.

ఇంతలో కాంపౌండరు వచ్చాడక్కడికి. రంగనాథ్ అతనికేదో ఇంగ్లీషులో చెప్పాడు.

కాంపౌండరు వాళ్ళతో 'మందులకి యాభయిరూపాయలవుతాయి! ఇవ్వండి" అన్నాడు.

వాళ్ళిద్దరూ ముఖా ముఖాలు చూసుకున్నారు. రంగనాథ్ వాళ్ళేమంటారోనని ఓరగా చూస్తున్నాడు తలొంచుకునే.

"యాడ తెత్తుము సావి, యాభయి రూపాయలు! బడుగులం!"

"అలా అంటే ఎలా కుదురుతుంది. ఇదేం

ఏకీలు కాకీలు వూడ బెః! చేతికిచ్చి పంపామో లెక్కలేదు........"

"పాపన్నపాళెంలో జూనియర్ కాలేజీ పెట్టారా కొత్తగా?" ఖద్దరువాలా అడ్డు తగిలాడు.

యోగా ఇన్స్టిట్యూట్ స్టూడెంటు "స్వామీ! తమరే యుగంలో బ్రతుకుతున్నారు? పాపన్నపాళెంలో జూనియర్ కాలేజీ పెట్టి మూడు సంవత్సరాలయింది. గత సంవత్సరం నుంచీ డిగ్రీ కాలేజీ స్టార్టు చేశారు. దానికి అనుబంధంగా వొక యోగ ఇన్స్టిట్యూట్ గూడా వుంది." అంటూ పళ్ళికిలించాడు.

ఖద్దరువాలా ముఖం ముడుచుకొని "నేనీ ప్రాంతానికి చాలా రోజుల తరువాత వస్తున్నాను. వాలుగేళ్ళనుంచీ హైదరాబాదులోనే వున్నాను" అన్నాడు.

"కొంపదీసి మీరు పాపన్న పాళెం ఎమ్మెల్యేగారికి స్నేహితుడు గాదుగదా!" బొమ్మలచొక్కా స్టూడెంటు అడిగాడు.

"అబ్బే! ఆయన నాకు స్నేహితుడు గాదుగానీ చాలా దగ్గరిబంధువు. స్వయానా మా ఆవిడకు పినతల్లి కొడుకు...."

"చూడగానే ఆయనకూ, మీకూ ఏదో దగ్గరి సంబంధముందని అనుకున్నాడులెండి! ఆయనగారు కూడా యిప్పుడు హైదరాబాదులోనే వుంటున్నాడు. ఇటువైపుకు వచ్చి చాలా రోజులయింది. బహుశా ఆయనగారే మీకు పోకివుంటుంది...." ఫుల్ పర్టు తొడుకున్న హిప్పీక్రాపు యువకుడు చేతిగుడ్డచాటున నవ్వు నాపుకుంటూ అన్నాడు.

"అంటే.... అంటే...." ఖద్దరువాలా మళ్ళీ ముఖం ముడుచుకున్నాడు. 'మీతో మాట్లాడమే నా బుద్ధి పొరబాటు' అన్నట్టుగా మరో పొగచుట్టను వెలిగించుకున్నాడు.

ఇంతలో వొక బొమ్మల చొక్కా విద్యార్థి తెలివిడి ద్వారా తనకేదో సందేశమందినట్టుగా "చైనెవరో లాగారు" అంటూ డోర్ దగ్గరికి పరిగెత్తాడు.

కిటికీ దగ్గర కూర్చున్న కుర్రాడు బయటికి తొంగిచూసి "అవునవును....స్పీడ్ తగ్గిపోయింది" అంటూ తానూ అతణ్ణి అనుసరించాడు.

ఒకరివెంట ఒకరుగా వాళ్ళ బృందమంతా డోర్ దగ్గరికి వెళ్ళిపోయింది. ఆ బెంచీ పైన మిగిలిన వాణ్ణి నేనొక్కణ్ణే! అదే అదనుగా భావించి కిటికీ ప్రక్కకు జారు కున్నాను.

రెండు మూడు నిముషాలసేపు పరిగెత్తడానికే ప్రయత్నించి, విఫలమై, శావగాలిపోయి, చివరకు నిస్సహాయురాలై నిలిచిపోయింది రైలు.

కిటకీలోంచి బయటికి తొంగి చూశాను.

రైలిలా హఠాత్తుగా ఆగిపోవడానికి కారణం తెలుసుకోవడం కోసం ఉత్సాహవంతులయిన ప్రయాణీకులు కొందరు అప్పటికే బయటికి దూకేశారు. కిటికీల ప్రక్కన కూర్చున్నవాళ్ళు మెడల్ని బయటికి వంచి ఆ చివరినుంచీ ఈ చివరి వరకూ చూపులతోనే రైలును తనిఖీ చేసేస్తున్నారు. చుట్టుప్రక్కల పొలాలలో పనిచేసు కుంటున్న రైతులంతా చచ్చిన పాము చుట్టూ గుమికూడే చీమలమల్లే ఆగిపోయిన రైలును చుట్టుముట్టేశారు.

"ఏం జరిగిందండి?" డిటెక్టివ్ నవలాప్రియుడు తుపాకీ పేల్చినట్టుగా ప్రశ్నించాడు.

"నాకు మాత్రం ఎలా తెలుస్తుందండీ?" అంటూ జవాబుకు బదులుగా నేనూ వొక ప్రశ్నను సరఫరా చేశాను.

"ఛీ....ఛీ.... ఈ మనుష్యుల్లో రాను రానూ డిసిప్లిన్ చాలా తక్కువయిపోతోంది. వీళ్ళకంటే పశువు లెంతో నయం .." ఆవేశంతో పిడికిలి బిగిస్తూ అన్నాడు అతను.

"మీకిది క్రొత్తగా కనిపిస్తూందేమో, ఇది రోజూ జరుగుతున్న తతంగమే!" అన్నాను.




డ్తుంటే పెళ్లి పీటల్ంద కూర్చున్నట్లు సిగ్గుపడతారేం ఈ అమ్మాయిలు! కాలి చెప్పు ఊడదీయక ..... .. అన్నాను. గుర్తుందా?"

"ఉంది-నీ ఉపన్యాసాలు గుర్తుపెట్టుకోడానికే కదా నేను పుట్టింది-"

"అదేంటి వీణా అలాగంటావ్"

"మరి....అలా ఉపన్యాసాలిచ్చే బదులు ఆ రౌడీ వెధవ గల్లా పట్టుకొని నాలుగు అంటించ కూడదూ! నువ్వు హాస్పిటల్‌లో అడ్మిట్ అయినా నేను గర్వించేదాన్ని...."

"ఎందుకు?"

"హీరో మరదల్ని అయినందుకు. ఊఁ...ఆ తరువాత?"

"నేనేం కథ చెప్పటంలా...."

"ఆ కళ అందరికీ అబ్బుతుందేవిఁటి.... ఇంతకూ ఇవ్వాళ కోఠి చౌరాస్తాలో జరిగిందేవిఁటో?"

"ఓ ఆడపిల్లల గుంపు ఏం చేసిందో తెలుసా?...."

"మా ప్రత్యేక విలేఖరికి తెలుసు–"

"నన్నేకదా నువ్వనేది!...."

"అబద్ధం ఆడితే మనల్ని మనం మోసం చేసుకున్నట్టు కదూ......."

"అవును..."

"గుడ్. ప్రొసీడ్...."

"ఓ పాప వస్తేగాని నీ అల్లరి తగ్గేట్టు లేదోయ్...."

"దానికెన్ని గుండెలు అప్పుడే మన మధ్య దూరటానికి...."

"ఇంతకూ నేను చెప్పేది విననంటావ్"

"ఛాఛా అలా ఎప్పుడూ అన్లేదు-"

"సినిమా బేనర్ల ముందు ఆడపిల్లలెందుకు నిల్చుంటారు...."

"ఆర్‌టీసీ వాళ్ళకు అనవసరంగా ఖర్చు ఎందుకని బస్ కోసం వెయిట్ చేస్తూ నీడ కోసం...."

"అయితే ఈరోజు నిల్చోలేదు-"

"అదేంటి పాపం! ఎండలో నిల్చు

## నియంతృత్వం

జ్వలించే మనసు
మంచులాంటి నిశ్శబ్దంలో
చిక్కుకొని
కొంకర్లు పోతోంది
వస్త్రాపహరణం చేసిన
ఋతువు
వినోదంగా చూస్తూనే ఉంది.

సైబ

న్నారా?"

"మూసివున్న పాన్ కొట్టు ముందు నిల్చున్నారు-

దారినపోయే కుర్రాళ్ళు అసభ్యకరంగా నున్న ఆ పోస్టర్ వంక చూడటం వెకిలి నవ్వులు, వ్యాఖ్యానాలు .... వగైరాలన్నీ కొట్టు ముందు నిల్చున్న అమ్మాయిలు చూస్తున్నారు ..."

"వాళ్ళను చూస్తూ నువ్వు నిల్చున్నావ్"

"మధ్యలో మాట్లాడకు.... చూసి చూసి ఆ అమ్మాయిల ఒళ్ళు మండినట్టుంది ఓ సైకిలు కుర్రాడు ఏదో అంటే వాడి గల్లా పట్టి రోడ్డుమీద పడేశారు-"

"స్పీడ్‌గా సైకిల్ తొక్కుతున్న కుర్రాణ్ణి ఎలా పట్టుకున్నారోయ్?"

"స్పీడ్‌గా ఎందుకు తొక్కుతున్నాడు అక్కడ స్పీడ్ బ్రేకర్ ఉందిగా...."

"కోఠీ చౌరస్తాలో స్పీడ్ బ్రేకరా!"

"అదేనోయ్ ఆ పోస్టర్ ...."

"అవునూ.... స్పీడ్ బ్రేకర్స్‌గా ఇలాంటి పోస్టర్స్ వాడుతున్నారేమో!...."

"అదేంకాదులే....అమ్మాయిలు రోడ్డు మీద నిలబడికూడా కలలు కంటుంటారు అన్నాను గుర్తుందా.... ఆ అభిప్రాయాన్ని ఈ రోజునుంచి మార్చుకుంటున్నాను-"

"వెరీగుడ్... నువ్వింకా చాలా మారాలోయ్ ..."

కొట్టుముందు నిల్చున్న అమ్మాయిల్లోంచి ఓ పొడుగాటి రెండు జడల అమ్మాయి ఏంచేసిందో తెలుసా ?...."

"అమ్మాయిల జడలు లెక్కబెడ్తావా! ఆఁయ్..."

"లెక్కబెట్ట నవసరంలేదు-చూడగానే తెలిసిపోతాయి"

ఇంతకూ అమ్మాయి పొడుగా? జడలా?"

"అమ్మాయీ పొడుగు, జడలూ పొడుగు. ఆ పొడుగు జడల అమ్మాయి సైకిలు కుర్రాణ్ణి కిందికి తోసి కాలి చెప్పు తీయబోయి రాకపోతే పక్కనున్న అమ్మాయి చెప్పు తీసుకొని మొహం శుద్ధి చేసింది-"

"మంచిపని చేసింది-"

"ఆగు-అప్పుడే చప్పట్లు కొట్టక-ఆ తరువాత మిగతా అమ్మాయిలంతా కలిసి ఆ రౌడీ వెధవని పోలీస్‌కి అప్పజెప్పి వీరావేశంతో పోస్టర్లన్నీ చింపేశారు—"

"కాని....సమస్య అంతటితో తీరదే.... సిటీనిండా.... ఎన్నెన్ని పోస్టర్లని... అసలు పోస్టర్లు చింపితే సినిమా రీళ్ళు తగలబెడితే సమస్య పరిష్కారం కాదు... స్త్రీని ఒక విలాసవస్తువుగా చూసే దుర్వాసనల మెదడు చింపేసి కొత్త మెదడు అతికించాలి..."

"అందుకు మీ స్త్రీలంతా వెంటనే నడుంకట్టాలి...."

"ఏం నువ్వు వంట చేస్తూ ఇంట్లో కూర్చుంటావా? అన్యాయాన్ని, అవినీతిని, దౌర్జన్యాన్ని ఎదిరించడానికి ఆడా, మగ తేడా లేదోయ్! ... పద ముందుకు—" ✱

# మానవ జీవితం

ఒక రోజు, ప్రొద్దున్నే దేవుడు మొహం కడుక్కొని జవాన్ని పిలిచేడు. రెండు మూడు సార్లు పిలిచినా ఎవ్వరూ జవాబివ్వలేదు. అప్పుడు దేవునికి, డబ్బులేక పోవటంవల్ల ఎస్టాబ్లిష్మెంటు తగ్గించిన సంగతి జ్ఞాపకం వచ్చి, విచారంగా కూర్చున్నాడు. కొంత సేపయింతర్వాత ఒక జవాను ప్రవేశించాడు. అతన్ని చూచి దేవుడిలా ప్రశ్నించాడు—

"మర్త్య లోకం నుంచేనా?"

"చిత్తం"

"ఏమిటి సంగతులు"

"అంతా అనుకూలంగానే వుందండీ! మానవుడు సగం జీవితం నేర్చుకోవటంతోనూ, మిగిలిన సగం తాను నేర్చుకొంది తప్పని తెలుసుకోవటంతోనూ గడుపుతున్నాడు...." అన్నాడు జవాను.

"మంచిది – కనుక ఇప్పట్లో మన కేమీ ఫరవాలేదన్నమాట! ఇంకా కొన్నాళ్ళ వరకూ మన భుక్తికి లోటు లేదన్నమాట!" అని కులికాడు దేవుడు.

- గోపీచంద్ -

# మనసుకే కళ్ళుంటే!

డా॥ కె.వి. కృష్ణకుమారి

"వింటున్నావా?-"

"ఊఁ.....—"

"నిజంగా—"

"అబ్బ చెప్పరా —"

శేఖరు మొహం కన్పించక పోయినా — మాటల్లో విసుగు కన్పిస్తుంటే చిన్నబుచ్చుకున్నాడు రామకృష్ణ.

"......... ....."

"సారీ... సోసారీ... ఇవాళ పనెక్కువగా వుందని చెప్పానుకదూ-అందుకే-కాస్త విసుగ్గా వుందంతే.."

ఆ విసుగు నీ మీద లేదన్నట్టు భుజం తట్టాడు శేఖర్.

శేఖర్, రామకృష్ణా, ఇద్దరూ ఒకే ఊళ్ళో చిన్నతనంలోనే కల్సిమెల్సి చదువుకున్నవాళ్ళు. మెరిట్ స్టూడెంట్సుగా కాలేజ్ ఒకేసారి వొదిలి పెట్టారు. ఒకరంటే ఒకరికి విపరీతమైన అభిమానం-ఆపేక్షావున్నాయి. దాపరికమంటే ఏమిటో మొదట్నుంచీ ఇద్దరికీ తెల్సేదికాదు-

ఎన్నో ఏళ్ళ తరువాత—విసిరేసినట్టు ఎక్కడికో వెళ్ళిపోయిన ఇద్దరూ ఒకే హోదాలో-ఒకే ఉన్నత స్థాయిలో ఒకే ప్రభుత్వ సంస్థలో-ఒకరి నొకరు కేవలం కొలీగ్స్‌గా పరిచయం చెయ్యబడ్డ— 'ఇద్దరూ' మాటలు మర్చిపోయి కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయారు.

మాటలు కరువయాయి.

మనసులు మూగపోయాయి.

ఆత్మీయతతో తిరిగి దగ్గరయాయి.

శేఖర్‌కి మొదట్నుంచీ ఎటువంటి బరువు బాధ్యతలూ లేవు వడ్డించిన విస్తరి లాంటి జీవితం, అన్నిటి లాగానే భార్య లక్ష్మి వెతుక్కుంటూ వచ్చేసింది దాంపత్య జీవితంలోకూడా అసంతృప్తి అంటే ఏమిటో తెలియని స్థితిలోనే ఇన్నేళ్ళూ గడచి పోయాయి. పెద్దవాడు ఇంజనీరింగ్‌లో చేరాడు. పాప మెడిసన్‌లో చేరే ఉద్దేశ్యంతో ఎంట్రన్స్‌తో కుస్తీపడుతోంది. ఎటు చూసినా లక్ష్మి, అదృష్టం, ఆనందం, తృప్తీ తాండవిస్తున్నాయింట్లో రామకృష్ణ మొదటి సారిగా శేఖర్ ఇంటికి వెళ్ళి-తన జీవితంలో లోపించిన దేమిటో అసలు జీవితానికి కావల్సిందేమిటో మొదటిసారిగా తెల్సుకున్నాడు.

అంతవరకూ పెళ్ళన్నా సంసారమన్నా అంతకుతూహాలం చూపించని రామకృష్ణ మొదటి సారిగా అనుకున్నాడు-

"ఇటువంటి స్వీట్ హోం వుండటం అదృష్టం!"

"దేనికీలోటు లేదనుకుంటున్న తన జీవితం ఎంత నిస్సారమైనది—"

రామకృష్ణ బాధ్యతల్నీ, పెద్ద కొడుకుగా తను మిగుల్చుకున్న ఒక్క బంధాన్నీ మరో బంధానికి ముడి పెడుతూ—తనకంటూ ఇంకేం సమస్యలు మిగలలేదనీ,



మిగుల్చుకోలేదనీ తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాక—అప్పటిదాకా ఏమీ మాట్లాడలేకపోయిన తల్లిదండ్రులు మొదటి సారిగా అన్నారు. బాధ్యతా యుతంగా అన్నారు.

"రామూ—చెల్లెళ్ళకీ-తమ్ముళ్ళకీ దోవలు చూపించావు. కన్నతండ్రికన్నా ఎక్కువగా నీ బాధ్యతలు నువ్వు నెరవేర్చుకున్నావు............"

"........................."

"సంతోషం నాయనా—నీలాంటివాణ్ని

కన్నందుకు మేము గర్వపడుతున్నాం — ఐతే-నిన్ను చూసి గర్వపడగల నీ పిల్లలకి తండ్రిగా నిన్ను చూడాలని వుందిరా—"

తేలిగ్గా నవ్వేశాడు రామకృష్ణ.

"అలా నవ్వేయకు. నీకేం వయసు మించిపోలేదు. నీకున్న అర్హతలకీ, ఇప్పటి నీ స్థితికి-పెళ్ళికూతుళ్ళు క్యూలోనిలబడి మరీ వస్తారు....ఇన్నాళ్ళూ - అనలేక పోయాం....—నీ పట్టుదల చూసి-ఇప్పుడింక-నీ మీద భారంగా ఎవ్వరూ మిగిలిలేరు.... మేంతప్ప—"

బాధగా చూశాడు రామకృష్ణ.

"నువ్వు భారం అనుకోవు.... తెల్సు.... మా ముచ్చటా———"

మళ్ళా బంధాలవెంట బాధ్యతల్లోకి దిగాలిక. అంత ఓపికుందా తనకిప్పుడు.?-

ఇప్పుడు పెళ్ళయితే-ఆ తరువాత పిల్లలు పుట్టి....వాళ్ళు పెరిగి .... మళ్ళా బాధ్యతలు....ఇంతేగా మళ్ళా—"

తలలో మెరుస్తున్న వెండివెంట్రుకల్ని చూస్తున్నప్పుడల్లా భారంగా అనుకునేవాడు.

ఐనా ఇప్పుడు తనకేం తక్కువైంది?. క్లాస్‌వన్ ఆఫీసర్. బాదరబందీలేని జీవితం. "ఈ రిటైర్డ్ లైఫ్ ఎంత హాయిగావుంది—"

శేఖర్ నవ్వాడు.

"ఎంత హాయిగా వుందో మా ఇంటి కొచ్చి నిర్ణయించుకు చెప్పు. ఓ. కె."

శేఖర్‌కి సమాధానం రామకృష్ణ కళ్ళల్లోనే కన్పించింది.

రామకృష్ణ ఓ. కె. చెయ్యడానికి తగినన్ని కారణాలు కన్పించాయి.

శేఖర్ రాకకోసం ఎదురు చూస్తూ శూన్యంలోకూడా తను కోరుకునే ఆ ప్రీతి కోసం ఎదురుచూసే లక్ష్మి కళ్ళల్లో ఎంత మెరుపు?

శేఖర్‌ని చూడగానే.

కారు హార్న్ విన్పించగానే-అమాయకంగా ఆత్మీయంగా తండ్రిని చుట్టుకుపోయే ఆ పసిపిల్లల్లో ఎంత తృప్తి.

అసలు శేఖర్ మొహమే ఎంతలా వెలిగి పోయింది.

పడ్డ శ్రమంతా మర్చిపోయి - తనకోసం తనవాళ్ళుగా-తను సర్వస్వం అర్పించటానికి సిద్ధంగా వున్నట్టు-వాళ్ళు తప్ప మరో లోకం లేనట్టు రెండు వైపులా పొదివి పట్టుకుని గర్వంగా లోపలికి వెడుతూ తన వంక ఆదోలా చూశాడు శేఖర్,

ఆ చూపులకి విలువ కట్టగలడా తను?

ఆ భావాల్ని చదవగల శక్తి వుందా తనకి?

గంటలు క్షణాల్లా విచిత్రంగా గడిచి పోయాయి.

ప్రతి క్షణం ఎంత విలువైందో స్పష్టంగా కన్పిస్తోంది.

ఎన్ని క్షణాలు .... క్షణాలేమిటి ఎన్ని సంవత్సరాలు ఇంత కాలం నిస్సారంగా గడచి పోయాయి.

ఎలా గడపగలిగాడు తను ?

ఇంటికి రాగానే ఉసూరు మన్పించింది.

తను అదృష్టంగా భావిస్తున్న ప్రశాంతత బరువు పెరుస్తున్నట్టుంది.

కారు గ్యారేజీలో పెట్టి - బరువుగా నిట్టూర్చాడు.

తన వెనుక తన నీడే వస్తోంది.

ముందున్న దంతా శూన్యంగా కన్పిస్తోంది.

అంతకన్నా శూన్యంగా చూస్తూ తల్లీ తండ్రీ కన్పిస్తారు.

ఎప్పటికప్పుడు తను క్షేమంగా వచ్చాడన్న సంతోషం తప్ప వాళ్ళ కళ్ళల్లో ప్రత్యేకంగా ఇంకేం కన్పిస్తుంది ?.

తన స్థితీ, హోదా, వాళ్ళలో-పూర్వపు సంతృప్తినీ, ఆనందాన్ని పెంచగల్చటం లేదెందుకని.?.

తానాశించే ఉత్సాహం వాళ్ళల్లో లోపిస్తోందేమిటి ?-

పూడ్చలేని వెల్తి వాళ్ళల్లో స్పష్టంగా కన్పిస్తోందెందుకని ?

ఈ వయసులో ఇంత నిశ్చింత ఎంత




మందికి దొరుకుతుంది ?.

ఈ అదృష్టం ఎంత మంది కుంటుంది ? రామకృష్ణ ఆలోచన్లూ అంచనాలు పూర్తిగా తారుమారైనట్లు కన్పించాయి.

శేఖర్ కుటుంబంతో సన్నిహితత్వం పెరుగుతున్న కొద్దీ - తన తల్లి దండ్రుల అసంతృప్తి భూతద్దంతో చూసినట్టు మరీ కన్పిస్తోంది.

అవును. ఆ వయసులో వాళ్ళు కోరుకుంటున్న కోరికలు ప్రకృతి విరుద్ధాలేమీ కావు.

"అడుగు తీసి అడుగేస్తే నౌకర్లూ చాకర్లూ-అన్నీ బాగానే అమర్చి పెడుతున్నారు. కాదనం....– కానీ ఇల్లంతా అజమాయిషీ చేస్తూ కోడలు పిల్ల తిరుగుతుంటే........"

"పుస్తకాలు చదివి కళ్ళు పోతున్నాయిరా రాముడూ—ఈ కళ్ళల్లో వెలుగుండగానే మనుమల్ని కంట చూస్తానో లేదో....—"

"కాలాని కేముందిరా—కదలకుండా కూర్చున్నా గడుస్తుంది - గార్డినాలేసుకు పడుకున్నా గడుస్తుంది....–ఒక అర్థం పరమార్థంతో అది గడిచినప్పుడేగా—అన్నీ సాధించామన్న తృప్తి మిగిలేది-"

"నిన్ను చూసి మేమెంత గర్వపడుతున్నామో. ..—రేపు నీ కొడుకుని చూసి నువ్వు ..."

ఇప్పుడు వాళ్ళ మాటలు అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డ్స్ అన్పించటం లేదు.

ముసలి నపు చాదస్తం కన్పించటం లేదు.

జీర్ణించుకున్న అనుభవం కన్పిస్తోంది.

తన కోసం వాళ్ళుపడే ఆరాటం స్పష్టంగా కన్పిస్తోంది.

తమవల్ల పుట్టి పెద్దది కాబడ్డ మొక్క పూలూ పళ్ళతో నిండుగా కళకళలాడాలనే ఆశ పడతారు ఎవరైనా—

అది సహజం.

కానీ తన ప్రవర్తనా సహజమనే ఇన్నాళ్ళూ అనుకుంటూ వచ్చాడు.

—ప్రకృతి సహజం మటుకు కాదు.

ఇది తెల్సుకోటానికి ఇంకా ఆలస్యం కాలేదు.

"నాన్నా.... నేను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాన—"

మాట మాత్రానికే ఆయనెంత సంబరపడిపోయాడు.

"అమ్మా—కోడలు కావాలన్నావు కదూ....వస్తుందిలే—"

ముందర తెల్లబోయి చూసినా—పాపం సంతోషంతో ఉక్కిరి బిక్కిరైపోయింది.

తల్లిదండ్రులకీ విషయం ఇంత సంతోషాన్ని కల్గిస్తుందా?

అప్పుడెంత తృప్తిగా వుంది తనకి.

ఇంక ముందున్న జీవితమంతా ఎంత నిండుగా హుందాగా కన్పిస్తోంది—

వెంటనే తన ప్రయత్నాలు తను మొదలు పెట్టాడు రామకృష్ణ. ఒక నిర్ణయాని కొచ్చాడు.

ం ం ం ం

"శేఖర్....ఇవాళ నీ మూడ్ బావున్నట్టు లేదు. వెడదాం పద—" రామకృష్ణని పరిశీలనగా చూశాడు శేఖర్.

అతని కళ్ళల్లో తృప్తీ, నిండుదనం స్పష్టంగా కన్పిస్తున్నాయి.

తన సమాధానం కోసం ఎదురు చూస్తున్న అసహనం కూడా కన్పిస్తోంది. "మూడ్ కేంలే" గాని — ఆలోచనంతా నీ గుంచే...."

"అంతగా ఆలోచించాల్సిన విషయమా?"

"లేదా కాస్త ముందరే పెళ్ళయుంటే ఈ పాటికి మనవడో మనవరాలో కూడా వుండి వుండేవారు. ఆలస్యంగా తీసుకున్న నిర్ణయాల్లో తొందర పడ్డామన్న భావం ఎప్పటికీ రాకూడదు. అసలు పశ్చాత్తాపం పడాల్సిన అవసరం తెచ్చుకోకూడదు....—"

శేఖర్ లో నిజాయితీ కన్పిస్తోంది. తన కోసం ఆరాటం కనిపిస్తోంది.

"అటువంటి పరిస్థితి నాకొస్తుందని ఎందు కనుకుంటున్నావురా?"

చిన్నగా అన్నాడు రామకృష్ణ.

"రాకూడదనే అనుకుంటున్నా. ఐనా ఎందుకో అనుమానం పట్టి లాగుతోంది."

రామకృష్ణ చిన్న బుచ్చుకున్నాడు.

గీత కళ్ళముందు కదిలింది.

గీత—

తనకేం అనాలోచితంగా పరిచయం కాలేదు. తను ఛార్జ్ తీసుకున్న రోజే—తన స్టెనోగా పరిచయం కాబడ్డ అందాల బొమ్మ. ఐతే ఆవిడ అందాన్ని గమనించి కుతూహలాన్ని పెంచుకు నే - తీరికా, ఉద్దేశ్యం బొత్తిగా లేవు రామకృష్ణకి.

ఆవిడ చురుకుదనం, పనిలో శ్రద్ధా, అణకువా, మర్యాదా, హుందాతనం మటుకు గుర్తించగలిగాడు.

—అదీ వృత్తి పరంగానే.

గీత వ్యక్తిత్వానికి గౌరవాన్నిచ్చేవాడు.

ఆ పని మెళకువని మెచ్చుకునేవాడు.

ఆ నిరాడంబరతకి ముచ్చటపడేవాడు.

అంతే. అంతవరకే....

ఐతే వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యం కలిగాక — మొదటిసారిగా తన ఆలోచన లోకి వచ్చింది గీత.

ఐతే ఏం?—

ఆ దృష్టితో పరిశీలనగా చూసిన రామకృష్ణలో గీత పరంగా అసంతృప్తనేది ఏ కోశానా మిగల్లేదు.

"సర్!—"

ఏదో అడగాలనుకున్న రామకృష్ణ తడబడేవాడు.

"ఎస్స్....."

కడిగిన ముత్యంలా, దంతపు బొమ్మలా, ఎదుట నిలబడ్డ గీతని చూస్తూంటే మనసు మూగబోయేది.

విశాలమైన ఆ కళ్ళల్లో, నిర్మలత్వం, హుందాతనమే కాదు, విశేషమైన అందం ఆకర్షణ కూడా పోటీల మీద కన్పిస్తున్నాయి,

ఆ చిరునవ్వు పెదాలు హాయిగా నవ్వుతూ-ఆత్మీయంగా పలకరిస్తున్నట్టుంటే-

తనెప్పుడూ చూడని సౌకుమార్యాన్ని, అతి సున్నితమైన అందాన్నీ, తన ప్రక్కనే ఊహించుకుంటే—అభావనే అద్భుతంగా వుంది.

ఆ ఊహే అనిర్వచనీయంగా వుంది.

తన సెలక్షన్ తప్పులేదనే ఉద్దేశ్యం-ఎంతో గమనించిన మీదట స్థిరం చేసుకున్నాడు.




అభిప్రాయం స్థిరపడ్డాక ఆలశ్యం చేయటం మంచిదనిపించలేదు. అందుకనే గీత అభిప్రాయాన్ని సూటిగా అడిగేశాడు.

గీత నిర్ఘాంత పోయింది.

కలో, నిజమో అర్థంకాలేదు.

వింటున్న దేమిటో చెవికెక్క లేదు.

కూటికి నోచుకోని పేదవాడి ముందు పంచ భక్ష్యాలూ అందుబాటులో కన్పిస్తున్నట్టున్నాయి.

అదృష్టం మీదే నమ్మకాన్ని పోగొట్టుకున్న గీతకి-తనకోసం ఇంతటి అదృష్టం ఎదురు చూస్తోందన్న విషయం నమ్మశక్యం కాలేదు,

ఇంత అదృష్టమా???.

లేకపోతే ఆయన అంతస్థేమిటి? తనెవరు?

ఇన్నాళ్ళూ తను మూగగా ఆరాధిస్తున్న దైవం.

కలలలో ఇంతటి వరాన్ని ఇవ్వటం. పొందటం సంభవమా?-ఇది కల కాదే-యదార్థం. యదార్థం.-

గీత అంగీకారం వేరే చెప్పక్కర్లేదు.

అందమైన కళ్ళు చెప్పాయి. చెప్పేశాయి.

రామకృష్ణని గమనిస్తున్న శేఖర్ మౌనంగా తల దించుకున్నాడు. గీత అందమైందే-ఎంతో మర్యాదగల మనిషిలాగే కన్పిస్తుంది ఐతే

రామకృష్ణ లాంటి మంచి మనిషికి-ఆ స్థితికీ స్థాయికీ, సరైన ఇల్లాలు కాదగ్గ అర్హతలున్నాయా?

పొట్ట చేత్తో పట్టుకుని ఉద్యోగానికొచ్చిన మనిషి. పొట్టనింపు కోడానికి, ఒకస్థాయిలో బ్రతకటానికి—"ఎటువంటి పార్ట్ టైం" జాబైనా చెయ్యగల సత్తావున్న మనిషని విన్నాడు.

"...... ఎటువంటి అంటే అర్థం??"

"అటువంటివి" కూడా అని విన్నాడు

ఆకుచాటులేని దోంపండు. చేస్తున్నది-పదిమంది మధ్యలో.

గీతే-మామూలు గీతైతే, అసలు ఆలోచించాల్సిన అవసరమే వుండేది కాదు. తనకొలీగ్స్ కాల్ గర్ల్ని చేసి మాట్లాడిన

ఎన్నో సందర్భాల్లో అందరితో బాటు తనూ ఆనందించాడు.

కానీ ఇప్పుడు అదే రామకృష్ణ భార్యగా ఊహించలేక పోతున్నాడు.

"బాగా ఆలోచించుకో... -"

"ఇంకానా?-ఇంతకన్నా-దేన్ని గురించి ఆలోచించలేదేమో-" రామకృష్ణ తేలిగ్గా అనేస్తుంటే—కష్టపెట్టుతున్నట్టు చూశాడు శేఖర్.

"చూడు .... ప్రేమా గీమా లేకపోయినా-మంచి సాంప్రదాయ కుటుంబం లోంచి వచ్చింది లక్ష్మి. చేసుకున్నాకే పరస్పరం ప్రేమించుకోటం అర్థం చేసుకోటం మొదలు పెట్టాం. చిలిపి తగాదాలు చాలా వచ్చేవి. రాలేదని చెప్పను. వస్తూనే వున్నాయి—ఐనా మా మధ్య చక్కని అవగాహనవుంది. చాలా లేతవయసులో పెళ్ళి కావటం వల్ల కావచ్చు. ఒకరికనుగుణంగా మరొకరం-ఒకరి కోసం మరొకరం మల్చుకో బడ్డాం... -"

"... ..............."

"వింటున్నావా?-"

"ఊం... -"

రామకృష్ణ కుతూహలంగా చూస్తుంటే శేఖర్ ఉత్సాహాన్ని పుంజుకున్నాడు.

"....ఇప్పుడు నీ విషయం పూర్తిగా వేరంటాను. దగ్గర దగ్గిర నలభై ఏళ్ళొస్తున్నాయి....-"

"దగ్గిరదగ్గిరా....-నలభై దాటాయిలే" తమాషాగా నవ్వాడు రామకృష్ణ.

"సరేలేవోయ్ ... -- అన్ని విషయాల్లోనూ ఇంత కరక్టయిన మనిషిని కాబట్టే ఇలా చెప్తున్నాను....ఒక రొటీన్ లైఫ్‌కి పూర్తిగా అలవాటు పడిపోయావు నువ్వు. నీలో స్థిరమైన నిర్ణయాలూ భావాలూ వేళ్ళునాటుకుపోయాయి.-అవునా కాదా?"

శేఖర్ ఇంతలా మాట్లాడం విచిత్రంగానే వుంది రామకృష్ణకి.

"అతిగా వాగుతున్నానా?"

"లేదులే....ఇప్పటికైనా ఆ వాగుడు లోపలి అంతరార్థం క్లుప్తంగా చెప్పెయ్యి."

"అదే—అదే....అసలిప్పుడు చెప్పొచ్చేదేమిటంటే...-ఈ వయసులో పెళ్ళి చేసుకోబోతున్నావు కాబట్టి-చేసుకోబోయే భాగస్వామి విషయాలు పూర్తి అవగాహన అవసరమంటున్నాను. ఏమంటే ఏదో చిన్నతనంలో చిలిపి ఆలోచనల్తో- సెక్స్‌తో కూడా ముడి వేసుకుని-దానికి ప్రేమను జోడించి ఇన్నాళ్ళు లాక్కొచ్చాం. ఇక ముందు పటిష్టం చేసుకున్నాం. నీ విషయం అలాకాదే....-సెక్స్‌కన్నా ఆత్మీయమైన తోడు అవసరం ఎంతైనా వుంది. సరదాల మాట అటుంచి బాధ్యతలతో అర్థాన్ని, కుటుంబానికో నిండుతనాన్ని నీ జీవితానికో పరిపూర్ణతని కోరుకోటం సహజం - లేదంటావా?-"

రామకృష్ణ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయాయి.

"అలా చూస్తావేం... -" తన మాటల్లో తొందరపాటు తన ముందా ?. భుజాలు తడుము కున్నాడు శేఖర్.

"లేదులే....కానీ ఇలా కూడా మాట్లాడగలవన్నమాట. ఇంత పెద్దరికం ఎప్పట్నుంచొచ్చిందిరా నీకూ ?-"

రామకృష్ణలో కనిపిస్తున్న ఆత్మీయతకి కొద్దిగా చెలించాడు శేఖర్.

అందుకే....అందుకే-రామకృష్ణకి అన్యాయం జరక్కూడదని కోరుకునేది. రామకృష్ణ కాపురం తన కాపురం లాగే నిండుగా పచ్చగా — సంతోషంగా సుఖశాంతుల్తో వుండాలి. తనకు తోడబుట్టిన వాడేవుంటే రామకృష్ణకన్నా ఎక్కువ ప్రేమించివుండేవాడు కాడు.

ఏమో!!!- కాదు.

ఇది ముమ్మాటికీ నిజం. అందుకే మనసు కీడును శంకిస్తోంది. గీత విషయంలో రామకృష్ణ పొరబడ్డాడేమో అన్పిస్తోంది-

ముందా విషయం రూఢి చేసుకోవాలి.

తన అనుమానాలో - విన్నమాటలో నిజంగా నిజమైతే ఈ పెళ్ళి జరక్కుండా




శాయ శక్తులా ప్రతిఘటించాలి-

తన సెలక్షన్ శేఖర్‌కి నచ్చలేదని తెలుస్తూనేవుంది-

కారణం 'ఇదీ' అని చెప్పగలిగే స్థితిలో వున్నట్టులేడు.

ఏమైనా-ఎలాంటివైనా శేఖర్ అంచనాలు తప్పు. ఆ విషయం తన మనసు చెపుతోంది. తను చదివిన గీత మనసు చెపుతోంది-

సరైన అవగాహనకి శేఖర్‌కి సమయం చాలదు —

ఎంత సమయమైనా ఇవ్వాలి తను -

రామకృష్ణ లేచినిలబడ్డాడు.

అతని నమ్మకం-తృప్తిగా పెదాలమీద మెరుస్తోంది-

ఆత్మ విశ్వాసం వెలుగులా కళ్ళలో కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది.

ఇది శాశ్వతమైతే ఎంత బావుండును -

ఇందుకు నేనేం చెయ్యాలి? -

ఏదైనా చేస్తాను -

రామకృష్ణ చెయ్యాలనుకుని - దృఢంగా అనుకున్నాడు.

బరువుగా లేచి నిలబడ్డాడు శేఖర్.

o o o

జి. ఎమ్ కి ట్రాన్స్‌ఫరైన సందర్భంలో ఇవ్వాల్సిన పార్టీ ఆరోజు కేన్సిల్ ఐంది లేకపోతే ఈరోజు ఈ సమయంలో తన కారు ఇంటివైపుకు దూసుకుపోతూ వుండాల్సింది కాదు -

ఇల్లు గుర్తుకురాగానే-శేఖర్ మనసులో మల్లెలు గుబాళించాయి. లక్ష్మి గుర్తుకు రాగానే మధురమైన భావన మనసులో, అగరు ధూపంలా వెలిగింది.

పైగా అర్ధరాత్రిలో తనొస్తాననుకుని వుంటుంది పాపం. పార్టీ లేదని తను కావాలనే ఫోన్ చేయలేదు.

ఎదురు చూడగా అందుకునే అనురాగపు అంచులు చూశాడు.

ఎదురు చూడకుండానే అనుభవించబోయే ఆనందపు లోతులు చూడాలని వుంది. టైము చూశాడు. పదూ పది.

ఇంకెంత? పావుగంటలో....

కారు సడన్ జెర్కిచ్చి ఆగింది.

ఎదురుగా వస్తున్న అమ్మాయి తన కారుతాకిడికి బలవంతంగా నిలద్రొక్కుకునే ప్రయత్నంలో పూర్తిగా కారుమీద వాలిపోయింది.

శేఖర్‌కి ముచ్చెమటలు పోశాయి.

హడావుడిగా కారు దిగుతూ దిక్కులు చూశాడు.

చుట్టు ప్రక్కల జనమెవ్వరూ లేరు. థాంక్ గాడ్. కొంతలో కొంతనయం.

"సోసారీ..."

ఆ అమ్మాయి బెదిరి చూసింది.

శేఖర్ నిర్ఘాంతపోయాడు.

"గీ ...మిస్... గీతా...."

రామకృష్ణతో చాలాసార్లు చూసింది శేఖర్ని. తన పనీ, ఇంటి బాధ్యతలో తప్ప మరో విషయం తెలియని గీత. ఉత్సుకతతో తను తెల్సుకున్నంత వరకూ — ఈ శేఖర్, రామకృష్ణకి ప్రాణ స్నేహితుడని తెల్సు.

పశ్చాత్తాపంతో కళ్ళు పూర్తిగా దించేసింది.

"క్షమించండి...తప్పునాదే-ఏదో ఆలోచిస్తూ....కారొస్తున్నది కూడా గమనించలేదు.

అంత దగ్గరగా గీత నెప్పుడూ చూడలేదు శేఖర్.

ఆ సమయంలో ఆ చీకటిలో దంతపు బొమ్మలా మెరుస్తోంది.

తెల్లని అర్గండీ చీరెలో — ఎంతో నిరాడంబరమైన అలంకరణలోనే మతిపోగొడుతోంది గీత.

ఆ బెదురు చూపులో....

పాల మీగడలాంటి ఆ సొగసు...

మనసులో హత్తుకుపోయి - ఆత్మీయత ను పొంగించే విచిత్ర భావం—

అన్నింటినీ మించిన ఆ హుందాతనం.

ఒహ్....అందుకే మనవాడు బుట్టలో పడిపోయాడు. బుట్టలో నిజంగా పడ్డాడు

శేఖర్ చూపుల్ని తట్టుకుంటూ చేతులు జోడించింది గీత

"వస్తానండీ ..."

"ఎక్కడికి?—ఎక్కడిదాకా వెళ్ళాలి?"

ఇప్పుడు తన కర్తవ్యం గుర్తుకువచ్చింది.

"హిమయత్ నగర్ దాకా— మాఇల్లక్కడే ..."

ఎంతో అణకువా వొద్దికా కన్పిస్తున్నాయి గీతలో.

"ఎక్కండి డ్రాప్ చేస్తాను—"

కంటి కొసల్లోంచి చూస్తూ అడిగాడు శేఖర్.

ఇటువంటివాళ్ళు ఎదురు చూసేదే ఇటువంటి లిఫ్ట్లకోసం. ఒకసారి లిఫ్టిచ్చాక పరిచయాల్ని పెంచుకోటం - ఆ తరువాత దగ్గరగా రావాలని ప్రయత్నాలు చెయ్యటం తనలాంటివాళ్ళ బలహీనతల్ని కనిపెట్టి అందమైన వలలు వేయటం— ఊపిరాడక తన్నుకు ఛస్తూంటే తమలా భాల్ని తాము చూసుకోటం—లేదా-బెదిరింపులు - బ్లాక్ మైల్సూ మామూలు కథే.

అందులో గీతలాంటి అమ్మాయైతే-

"వస్తానండీ—"

గీత వెళ్ళబోయింది.

"ఫర్వాలేదు డ్రాప్ చేస్తాను నేను-"

రామకృష్ణని గీత ప్రక్కన ఊహించుకునే ప్రయత్నంలో అతి కష్టం మీద అన్నాడు.

"ఎందుకండీ....రిక్షాలో వెళ్ళిపోతాను."

ఎవరో తిరిగిచూస్తూ మరీ వెడుతున్నారు.

ఎదురుగా వచ్చేవాళ్లు కళ్లు చికిలించి మరీ చూస్తున్నారు

ఇంక క్షణం ఆగటం మర్యాద కాదన్పించింది.

-ఇద్దరికీ

శేఖర్ చెయ్యి డ్రైవర్ ప్రక్క డోరు మీదుంది.

గీత తల వంచుకుని వెనుక సీట్లోకి ఎక్కక బలంగా డోరు లాగేసింది.

కొద్దిగా చిన్నబోయాడు శేఖర్.

ఇదేమిటి? గీతను గురించి తను వినటం మంచి విధంగా.....

"ఎక్కడున్నం చేస్తున్నారు?....అసలే రోజులు బాగాలేవు కదా—"

కారు మెత్తగాదుసుకు పోతుంటే చిన్నగా అన్నాడు శేఖర్.

"ఒకటి రెండు చోట్ల ట్యూషన్సున్నాయండీ, ఆఫీసవగానే....అవి పూర్తి చేసుకుని ఏకంగా ఇంటికి వెళ్ళిపోతాను-"

"ట్యూషన్సెందుకూ-మీకు మంచి జీతమే

వొస్తుందను కుంటా-" తన లాంటి వాళ్ళకి వేల మీద వచ్చినా-హోదాని మైంటైన్ చెయ్యాలని ఎంత డబ్బు చాలదు. ఇటు వంటి వాళ్ళకి-న్యాయానికి ఐనువందలు చాలొచ్చు ఎంత చెట్టుకు అంతగాలైనా.. గీతలాంటి వాళ్లు సరిపెట్టుకోవాలి రెండు చేతుల్తో-

ముందు అద్దంలోంచి గీత శీలంగా కన్పిస్తోంది.

ఆ కళ్లు అమాయకంగా నిశ్చలంగా ఎటో చూస్తున్నట్లున్నాయి.

"జీతం చాలదు సార్—అనుకున్నది సాధించాలంటే....కొన్ని తప్పవు"

గీత గొంతు దృఢంగా విన్పించింది.

అనుకున్నది సాధించటమంటే—రామ కృష్ణ లాంటి అమాయకులు మీద వల వేసి పట్టుకు నేదాకానా?-ఆ తరువాత సంపా దించాల్సిన అవసరమేం వుండదు. భేష్ మంచి ప్లానే—

"సర్....రైట్....రైటుకు తిప్పాలి-"

కారు రైటుకు తిరిగింది.

ఇలా కార్లలో తిరగటం అలవాటు లాగేవుంది. తను రామకృష్ణ ఫ్రెండని తెల్సుకదూ-అందుకే ముందు జాగ్రత్తగా వెనకాల కూర్చుంది.

శేఖర్ కారు స్లో చేస్తున్నాడు.

ప్రొద్దుట్నుంచీ అల్సిపోయినా—అప్పుడే వికసించి మంచు బిందువులతో తడిసిన పారి జాతంలా వుంది గీత.

ఎదుటి వాళ్ళ అలుపు పోగొట్టేటంత ఫ్రెష్‌గా వుంది.

"సర్. లెఫ్ట్‌కి తిప్పాలి......—"

బాధపడుతున్నట్టూ-సిగ్గుపడుతున్నట్టూ అందిగీత.

తనలాంటి ఆఫీసర్ కార్లో కూర్చున్న గీతలాంటి అమ్మాయికి ఆ రెండూ సహ జమే మరి.

ఏ నిముషాన ఎటు తిప్పాల్సొస్తుందోనని బాగా స్లో చేశాడు శేఖర్.

'గీత దంతపు బొమ్మలాంటిది-'మరోసారి అనుకున్నాడు శేఖర్. రామకృష్ణ గుర్తుకు రావటంతో లక్ష్మి గుర్తుకువచ్చింది. ఛఛ లక్ష్మితో-గీతకు పోటీ పెట్ట కూడదు...— గీత కేవలం అందాలబొమ్మే-లక్ష్మి-పవిత్ర మైన దేవతా మూర్తి. గుండెనిండుగా గాలి పీల్చుకున్నాడు శేఖర్ -

'పూర్ రామకృష్ణ — పశాటు కన్వెన్స్ హిం?-'

"సర్ ఇదే ఇల్లు -"

మళ్ళా సడెన్ జర్క్‌తో ఆగింది కారు.

ఇంటికి దూరంగా ఎక్కడో ఆపి థాంక్సు చెప్పి తలొంచుకుని వెళ్ళిపోతోం దనుకున్నాడు. కానీ-మహారాణిలా కారు దిగి చిరునవ్వుతో చేతులు జోడించింది.

"సర్-ఇంట్లోకిరండి-నాన్నగార్ని ఇట్ర డ్యూస్ చేస్తాను-"

"పరవాలేదు—"

"పరవాలేదుసర్ రండి—"

కాదనలేక పోయాడు.

'ఒకవేళ ఇంటికి పిల్చి...—' ఈ టెక్నిక్ కూడా విన్నట్టే గుర్తు.

అయిష్టంగానే లోపలికి అడుగు పెట్టాడు.

ఒక దేవాలయంతో అడుగు పెడుతున్న భావన విచిత్రంగా ఉక్కిరి బిక్కిరి చేసింది.

వీల్ చైర్‌లో కూర్చున్న పెద్దమనిషి కళ్ళతోనే-పలకరింపుగా--ఆత్మీయంగానవ్వి కూర్చో మన్నట్టు సోఫాచూపించాడు.

"నాన్నగారూ శేఖర్‌గారు....అంటే రామకృష్ణ గారి-........—"

గీత పరిచయం చేస్తుండగానే ఆ ఇంటి వాతావరణాన్ని కళ్ళతో చదివేశాడు శేఖర్. చక్కని అభిరుచి-స్వచ్ఛమైన నిరాడంబరత-హుందాతో కూడిన డెకరేషన్-ఒకసైనో ఇల్లంటే నమ్మబుద్ధికావటంలేదు-

"క్షమించాలి నేను లేచి మర్యాదలు చెయ్యలేను. బికాజ్ అయామె పెరాలిటిక్ పేషంట్——"

ఆ గంభీరతకూ-స్వచ్ఛతకూ కొద్దిగా చలించాడు శేఖర్. అంతవరకు, ఆయన్ని గమనించనందుకు బాధపడ్డాడు.

"గీత....గారు--ఒక్కరే చూస్తోంటే-" తడబడ్డాడు శేఖర్.

ఆయన నిట్టూర్పులో బాధ ధ్వనించింది-

"నేను రిటైరయాక-ఇంటి బాధ్యతంతా గీతమీద పడింది-పైగా ఈ జబ్బొకటి....——"

"ఏ డిపార్ట్ మెంటండీ?-"

ఏ గుమాస్తావో అన్నట్టు యధాలాపంగా అన్నాడు శేఖర్

"మెడికల్-రీజినల్ డైరెక్టర్ గా——"

శేఖర్ ఉలిక్కి పడ్డాడు.

"బాబు-కృష్ణా—"

లోపలికి వెళ్ళబోతున్న కృష్ణ శేఖర్ ని చూసి సభ్యతతో నమస్కరించాడు.

"కృష్ణ-గీత తరువాత వాడు-ఈ నెలతో ఎం. ఎస్. ఐపోతుంది గీత పంతం పట్టుదల నెరవేరినట్టే ....— ఇక వాడి సంరక్షణలో నన్నుంచి .... " తృప్తిగా నవ్వుతున్న ఆయన కళ్ళల్లో నీళ్ళు స్వచ్ఛమైన ముత్యాల్లా మెరిశాయి. తను నిజాయితీతో మిగుల్చుకున్న రత్నాలను చూసి గర్వంగా వెలిగాయి.

"గీత అందర్లాంటిది కాదు బాబూ-అర చేతుల్లో పెంచినా - దాని వ్యక్తిత్వంతో మమ్మల్నే పెంచింది-రామకృష్ణగారు కోరి చేసుకుంటానన్నారని తెల్సింది-" పై పంచతో కళ్ళద్దుకుంటున్న ఆయనలో సంస్కారం చూసినకొద్దీ కన్పిస్తోంది."

"సార్—కాఫీ తీసుకోండి—"

కృష్ణ చేతుల్లోంచి కప్పందుకున్నాడు-

ఆప్యాయంగా అందుకున్నాడు. ఆత్మీయంగా పెదాల కానించాడు.

కృష్ణలో గీత అందం కన్పిస్తోంది. హుందాతనం ఆ అందానికి మరింత మెరుగులు దిద్దింది. తన కూతురు ఈ ఇంటి కోడలైతే -

అలా అన్పించిందా క్షణం.

ం ం ం

కాలింగ్ బెల్ అదేపనిగా మోగుతుంటే బద్ధకంగా తలుపు తీసింది లక్ష్మి. శేఖర్ ఇంట్లోకి అడుగు పెట్టటం రెండుగంటలు కొట్టటం ఒకేసారి జరిగాయి.

"అబ్బా ఇంత ఆలస్యంగానా రావటం? ఇంతవరకూ పార్టీయే-"

అగ్ని గోళాల్లా మండుతున్న శేఖర్ కళ్ళల్లోకి చూసుంటే-అంత పతివ్రతా భస్మమైపుండేదే. నలిగిన పట్టుచీరె, మెరుస్తున్న నగలూ—మత్తెక్కిస్తున్న మల్లెలూ చిరుచిరు అందెలూ.... లక్ష్మి ఎప్పటిలాగే వుంది....—

కానీ—!!!

"లేటని చెప్పారు గానీ మరీ ఇంత లేటా? బాబూ బేబీ, పిక్చరునుంచొచ్చి చాలాసేపు మీకోసం చూశారు-"

ఏదేదో చెప్తూనేవుంది లక్ష్మి. అమాయకంగా కళ్ళు తిప్పుతూ వెంటవెంటే కిరుగుతూనే వుంది. ఐనా ఆ కళ్ళు మూతపడుతూనేవున్నాయి.

శేఖర్ కళ్ళు మటుకు విచ్చుకుని శూన్యాన్ని కాల్చేలా చూస్తున్నాయి.

# ఏలికపాము ప్రార్థన

మానవా నీవే మా సృష్టికర్తవు. నీవే రక్షకుడవు, నీపేర్లు అనంతములు. నిన్ను అనేకులు అనేక పేర్లలో పిలవగా తెలుసుకున్నాము. నారాయణా వెంకటప్పా, జోగులూ, రంగమ్మా, హంస్నేన్, పాప, చిట్టి, రాజా - బాబు ఇవి నీ పవిత్ర నామములలో కొన్నిఐ ఉన్నవి

నీవు శాశ్వతుడవు, నీకు మృత్యువు లేదు. నీవు చండ శాసనుడవు. నీ ఆజ్ఞకు లోబడి ఈ పేగు భువనము లన్నీ ఉదరాకాశమున అత్యద్భుతముగా నిలచియున్నవి.

నీవు భీషణుడవు అప్పు డప్పుడు పెద్ద భూకంపములను కలుగ జేసెదవు.

నీ ఆజ్ఞా బద్ధులమై కామక్రోధములను విడనాడి సంసారాపేక్షలో మాత్రమే మా స్త్రీలతో సంగమించి నీ హృదయయునకు ఆహ్లాదమును వొడగూర్చుచున్నాము.

నీవు ఆగ్రహపరుడవై గర్జించునపుడు మా ప్రాణములు దద్దరిల్లి భయముతో వణకెదము. అంత గర్జించి గూడ మాకే కించి దపాయము గూడ కలుగ జేయవు. ఎంత కరుణామయుడవు. మేము క్రీడించుటకై ఈ మాలమును, మేము సేవించుటకై ఈ చీమును సృజించితివి. ఈ అప్రమేయ వరములకై మేము శత సహస్ర వందనము లర్పించుచున్నాము.

ఓ మహాప్రభూ! నీవు శివుడవు, రోగ రహితుడవు. సమస్త ప్రపంచములకు ఆధార భూతుడవు. నిష్కల్మషుడవు సత్యరూపా నీకు జోహారు.

(1935 "చిత్రగుప్త" పత్రికలో ప్రచురించబడింది)

సేకరణ : శ్రీ వావిలాల సుబ్బారావు

- చెలం -

"నేను పడుకోనా?- మీరు మొహం కడిగేసుకురండి-"

బెడ్ రూమ్‌లోకి వెడుతున్న లక్ష్మిని అనుసరించటానికి కాళ్ళు ముందుకు సాగ లేదు.

గెస్ట్ రూమ్‌లోకి వెళ్ళి అలాగే భారంగా మంచం మీద పడుకున్నాడు.

కంటి సెగలు ముంజేతిని తాకుతున్నాయి.

గుండె మంటలు ఆవేశంతో ప్రజ్వరిల్లుతున్నాయి.

కళ్ళు మూసినా తెరచినా ఒకటే దృశ్యం-

దృశ్యం !!!-

శేఖర్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

రఘూ'!!-

రఘు తన పరపతితో ఉద్యోగాన్ని సంపాదించుకోవాలని ఈ ఇంటిని ఆశ్రయించిన మనిషి. లక్ష్మికి దూరపు చుట్టం. నౌకరీ కోసం ఈ ఇంట్లో నౌకర్లా చాకిరీ చేస్తున్న వెధవ....-

లక్ష్మి ప్రోద్బలంతోనే ఈ ఇంట్లో కుక్కలా బ్రతుకుతున్న....-

శేఖర్ కణతలు విపరీతంగా అదురుతుంటే గట్టిగా నొక్కిపట్టాడు.

రఘు ఊరెళ్ళి ఇవాళే వచ్చినట్టున్నాడు. సమయం-సందర్భం-కలిసి వచ్చాయి.

చక్కగా సద్వినియోగం చేసుకున్నారు-

ఇద్దర్నీ బెడ్ రూమ్‌లో-"అలా" చూసి-గిరుక్కున వెనుకకు తిరిగి వచ్చేశాడు తను. సమాజం-సమాజంలో తన స్థానం-పరువూ-దానితో ముడి పెట్టుకున్న ప్రతిష్ఠా తర తరాల సాంప్రదాయం-దాన్ని పట్టుకు వ్రేళ్ళాడుతున్న తన మూర్ఖత్వం, ఇన్నాళ్ళూ కళ్ళు మూసుకుపోయిన తన వివేకం-ఇప్పుడే తట్టి లేపిన కర్తవ్యం-మళ్ళీ తనని ఇంటికి వచ్చేలా చేశాయి.

ఈ నిజం కళ్ళ పడక పోతే ఎంత బావుండేదో?

ఎవరికి బావుండేది?

నిజమనుకుంటున్న తన కల భ్రాంతని తెలియక పోతే బావుండేదా?

ఎంత భ్రాంతి!!!

హైక్లాస్ సొసైటీలో ఇటువంటివి జరుగుతాయట-జరిగాయి-జరిగింది-ఐనా తెల్లవారగానే సాంప్రదాయమనే ముసుగు మర్యాదగా తగిలించుకోవాలట-

తగిలించుకోవాలి!!!-

కాకపోతే సమాజంలో తన స్థానం....?

పిల్లల భవిష్యత్??-

భగవాన్!'-

చటుక్కున గీత గుర్తుకు వచ్చింది-

ఒక్క కుదుపున లేచి ఫోనందుకున్నాడు. క్షణం కూడా ఆలస్యాన్ని భరించలేనంత ఆత్రంగా నంబర్ డయల్ చేశాడు-

ఎంతో సేపటికి అవతల ఫోనందుకున్నాడు.

"హలో....రామకృష్ణా.....నువ్వేనా?-"

"శేఖర్........ఏమైంది?-" రామకృష్ణ నిద్రమత్తులోనే గాభరాగా అరిచాడు.

"బ్రదర్-నీ సెలక్షన్ ఎక్సలెంట్, గీత నీకు తగ్గ ఇల్లాలు...."

రామకృష్ణ నవ్వు వినిపించింది.

"నవ్వకురా-ఇందాకట్నుంచి ఆలోచించాను. రేపే వాళ్ళతో మాట్లాడు....ఈ విషయం నీతో చెప్పేదాకా........నిద్ర రాదేమోనని...."

"నీ బొంద.... అందుకంత అర్ధరాత్రి ఫోనా....—"

శేఖర్ ఫోన్ పెట్టేశాడు.

చిరుగజ్జెలు దగ్గరౌతుంటే-ఆవేశంగా లేచి తలుపులు మూసి వేశాడు.

తెల్లవారితే లక్ష్మి దేవతలా దర్శనమిస్తుంది.

అప్పుడు....అప్పుడు-సమాజంలోని ఒక ప్రముఖ వ్యక్తిగా, తనేం చెయ్యాలి? -ఏమీ చెయ్యలేని నిస్సహాయత నిద్రను ఆవహించింది.



# సీరియల్

# సౌభాగ్యలత

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి రామశాస్త్రి

—జరిగిన కథ—

(మహేష్ తలి దండ్రులు అడిగే కట్న కానుకల భారానికి ఆ సంబంధమై తన నిర్ణయాన్ని విశ్వేశ్వరికీ, శశిరేఖకీ తెలియనీయలేదు రఘురామయ్య. శ్రీమంత్ సలహాని కోరాడు ఆయన. ఎట్టి పరిస్థితులలోనూ శశిరేఖ పెళ్ళి జరపటం మంచిదని సలహానిచ్చాడు శ్రీమంత్.... ఆ పెట్టిపోతలతో బాటు కొ తయినా వకుళా శ్రీమంత్‌లకు ఇవ్వాలనుకున్న రఘురామయ్యను వారించారు వకుళా శ్రీమంత్‌లు - ఆ సందర్భంలో వకుళ, శ్రీమంత్‌లు దగ్గరయ్యే అవకాశం ఏర్పడింది.)

—ఇక చదవండి—

అనుభవంలేని, లోకమెరుగని అతి సుకుమారిణి!

"చూడు వకుళా! మనం ఏం చేసినా మీ నాన్నగారి కోసం. అంతేగా? మళ్ళీ ఈ రోజు ఈ క్రొత్త బాధ ఏమిటి చెప్పు?"

వకుళ పదే పదే కనులు తుడుచుకొంటోందే కానీ తలఎత్తలేదు.

'ఎంత సిగ్గులేమిగా ప్రవర్తించాను? ఛ, శ్రీమంత్ ఏమనుకొన్నాడో?'

తల భూమిలోనికి కృంగి పోసాగింది.

"మన వివాహం, ఎందుకు జరిపించావు? 'నాన్నగారి కోసం!' అన్న ఆ ఆరిందాతనం ఈనాడేమైంది చెప్పు? మనస్సు బలహీనతకు వశం కాకూడదు. మనం చేస్తూన్న ఈ త్యాగం, లేక సాయం—మీ నాన్నగారి కోసం. అంతే. లే, మరి పోయి నిద్రపో, అనవసరంగా ఆలోచించకు."

కానీ వకుళ నిదురించ లేకపోయింది, మనస్సు కల్లోల సాగరంవలె వున్నది.

తనవారే తనకు పరాయి వారూ, శత్రువులూ కావడంకన్నా దుర్దినం ఏముంటుంది?

తల్లికి ఎందుకంత నిర్లక్ష్యం? ఎందుకంత అక్కసు తనపై?

శ్రీమంత్ కూడ నిశ్చింతగా లేడు.

'ఇంట వున్నది తామిద్దరే, ఇద్దరిలోనూ సర్దుకుపోయే సమరసత వున్నది, అయినా ఏమిటిది? తమ ప్రమేయం లేకనే ఇంట అశాంతి ఆక్రమించుకొంటున్నది. తమకు సమస్యలు లేవు. అయినా ఏదో సమస్య తమ యింట స్థావరమేర్పరచుకొన ప్రయత్నిస్తోంది.'

ఇరువురికీ తెలుసు రెండవవారు నిదురించలేదని.

ఉదయం శ్రీమంత్ ఆఫీసుకు వెళ్ళగానే వకుళ తండ్రి యింటికి వెళ్ళింది.

రఘురామయ్య అమితానందంతో "వచ్చావామ్మా" అని పలుకరించాడు.

"రాలేదా మీ మామయ్య?" అని కుశల ప్రశ్న వేశాడు.

"అమ్మాయొచ్చింది" అంటూ లోపలికి ఓ కేక పెట్టాడు.

"అమ్మ పనిలో వున్నట్టుంది. నేనేవెళ్తాను లెండి."—విశ్వేశ్వరి వంట యింట్లో అవస్థ పడిపోతోంది.

"వెధవలకి రోజూ సెలవులే! చచ్చిపోతున్నాం. మరో వంటవాడిని చూసుకోవాలి" అంటోంది.

"ఔనండమ్మా అప్పుడే ఆడి రోగం కుదిరేది." అని వంత పాడుతోంది పిండి రుబ్బుతూన్న పని మనిషి.

"ఇదిగో-ఈ కాఫీ పెద్దమ్మాయి గారికిచ్చిరా నువ్వు ముందు....ఇంకెన్నాళ్ళు పెళ్ళయి వెళ్ళిపోతోంది. అక్కడెలా జరుగుతుందో?—.. ?" కంఠంలో ఆందోళన.

"ఊరుకోండమ్మా, మీకంటె గొప్పోరటగా? ఇంత కంటే బాగా జరుగుతాదక్కడ. అమ్మాయి గారి పెళ్లికి నాకు మంచి కొత్తచీర మరువకండమ్మా."

తంగి కులుకుతూ వెళ్ళిపోయింది కాఫీ కప్పుతో.

అంతా వింటూన్న వకుళ మనసులో ముల్లు గ్రుచ్చుకున్నట్లుంది.

'అక్క మీదున్న వగా ప్రేమలలో వందోవంతైనా వున్నాయా అమ్మకు నాపై? ఎందువల్ల?'

"ఎవరూ వకుళా? కూర్చో" అన్నది ఇటు తిరిగి.

"వంటవాడు రాలేదమ్మా?"

"రాలేదమ్మా, అవస్థయిపోతోంది. రేపు క్రొత్తపెళ్లి వారి ముందుకూడా ఇలాగే నాచేత పనిచేయిస్తాడేమో?"

"పనిమనిషెటూ వున్నది గనుగ వంట మనిషి అవసరం లేదేమోనమ్మా?"

వినకూడని మాట విన్నంత ఉక్రోషంతో ఒక్కసారి నఖశిఖ పర్యంతం చూచింది వకుళను విశ్వేశ్వరి.

"ఔనులే, ఏ గూటచిలక ఆ గూటిపలుకని...ఆ యింటి తక్కువ తనమూ తక్కువ బుద్ధులూ బాగా వంట బట్టేశాయన్న మాట?"

వాడిన వకుళ వదనం నేలకు వాలింది.

"నేనా ఉద్దేశ్యంతో అనలేదమ్మా..............—...."

"చాల్లే, పరువంతా మంట గలుపు తున్నావు కదూ?" నిర్వైర పాటుతో చూచింది వకుళ.

"నేనా అమ్మా?"

"ఆఁ. నువ్వే! ప్రొద్దున్నే వీధివాకిలి తుడిచి ముగ్గు వేస్తున్నావురోజూ, చూస్తున్నాను. ఇక్కడ మన పని మనిషి—అక్కడ నువ్వా! ఏం ఖర్మే? ఓ పాతిక పడవేసి పని మనిషినే పెట్టుకోలేరూ? నువ్వు ఎవరి బిడ్డవూ, ఎలా పెరిగావూ? కడుపు తరుక్కు

పోతోంది, తల వాలి పోతోంది."

"అమ్మా!" ఆవేశానికి లోను కాకుండా అతిశాంతంగా మాట్లాడింది వకుళ.

"అమ్మా, ఇంటి ఆడపిల్ల తిరగరాని తిరుగుళ్ళు తిరిగితే తలిదండ్రుల తలలు వ వలసి వుంటుందని అంటారు పెద్దలు, తన ఇల్లుతాను గుట్టుగా దిద్దుకొనే కూతురిని చు కొని కన్నవారు గర్వపడాలి!"

"ఆ హా హా!"

ఆ కంఠం శశిరేఖది.

"శ్రీమతి శ్రీమంత్‌గారి హిత బోధలు ప్రొద్దున్నే వినే అదృష్టం కలిగింది."

ఆ హేళన వకుళకు వినిపించడంలేదు.

'ఇపుడే నిద్రలేచిన అక్క ఎంత అందంగావుంది! అందుకేనేమో అమ్మకు అక్క అంత ప్రేమ?'

"నిన్నట్నుంచీ రావాలనుకుంటున్నానక్కా నీకు కొన్న సామానులు చూడా పద," అంటూ లేచింది, తల్లి ఎదుటినుండి పారిపోవాలని.

అతి ఆనందంగా చూపుతోంది శశిరేఖ దుస్తులూ, నగలూ, ఫ్రిజిడైర్........అ

"అక్కా, వాళ్ళు చాలా ధనవంతులుకదా। చీరలూ, నగలూ సరే నీకేవు యనుకో. ఈ ఫ్రిజ్ కూలర్, కార్పెట్స్—ఇవన్ని ఎందుకు? వాళ్ళ ప్రతి గదీ వీ ఇది వఱకే నిండిపోయి వున్నవటగా?"

"ఔను' ఇవి నాగదులలో వుంటాయి, నేనూ వాళ్ళకు సరైన దాననని గర్వ వుంటాను!"

"మరి నాన్నగారి శేష జీవితం? ఇంత ఖర్చు తట్టుకోగలరా నాన్నగారు?"

గుఁరుగా చూచింది శశిరేఖ.

"ఏం నాన్నగారికేం?"

"ఉన్నదంతా నీవే తీసుకెళ్తే?"

"నాన్నగారికి చాలినంత వున్నదిలే. నీకు మాత్రం మిగలదు. అదేనేమో నీబాధ

"అక్కా.....!? నేనసలా ఉద్దేశ్యంతో మాటలాడటం లేదు."

"మరి? నీకే పాపం నాన్నగారి మీద ప్రేమ, ఇంకెవరికీ లేదు."

"అది తర్వాత తెలిసేది. తర్కాలకు రాలేదు నేను. కాని ప్రేమ వివాహాలు కు

డబ్బుతో ముడిపడి వున్నాయవి మాత్రం యిపుడే తెలుసుకున్నాను."

"హుఁ... కారణం - ఆ వరుడు లక్షాధికారి గనుక, ఇంకా మాట్లాడితే కోటీశ్వరుని పుత్రుడు గనుక. బికారి కా.......దు గనుకా."

అదు గడుగునా ప్రతి పదంలో అతిశయం, అహంభావం ఉట్టి పడుతోంది.

అంతలో విశ్వేశ్వరి కూడా వచ్చింది పైకి—కూతుళ్లిద్దరికీ ఫలహారాల పళ్ళెరాలతో.

మానసికంగా బాధపడుతూన్న వకుళకు తీసుకోవాలన్పించక ప్లేటు ప్రక్కన వుంచేసింది.

"అంతా నాకే ఇచ్చేస్తున్నావని బాధ పడ్తోందమ్మా నీ చిన్న కూతురు!" శశిరేఖ వెటకారం, ఫిర్యాదు మిళాయించింది.

"ఎందుకూ? వాళ్ళే వద్దన్నారుగా? ఏం అడిగితే మీకు మాత్రం ఇవ్వక పోదుమా? ఆనాడు వద్దని బీరాలు పోయి ఇప్పుడెందుకు బాధ?"

"అది కాదమ్మా, నేనలా అనలేదు, నువ్వూ నాన్నగారూ ఇంకా అనేక సంవత్సరాలు ఇదే హోదాలో హాయిగా గడపాలన్నాను. అంతే." అన్నది వకుళ.

"ఆ బెంగ నీకేం అక్కర్లేదులే! అమ్మానాన్నల విషయం ఆ మాత్రం పట్టించుకొనే దానవైతే ఇలా చేస్తావా? నేను వద్దన్న బీదవాడిని ముడిపెట్టుకుంటావా? అక్కను వదలి నువ్వు పెళ్ళి చేసుకుంటావా? నీ భర్తకు చాలా గర్వం. అది శశిరేఖ ముందే గ్రహించింది. నేను ఆలస్యంగా గ్రహించాను అంతే, పెండ్లి కాకముందు ఇంటిచుట్టూ తిరిగేవాడు—ఇంటి అల్లుడననే గర్వం వచ్చి ఇప్పుడసలు ఇటు రావడమే మానేశాడు."

"అవన్నీ నువ్వూహించు కుంటున్నావు. అతడు అక్క ఎదుట తిరగలేక రావడం లేదని అనుభజ్ఞురాలిగా నీవు గ్రహించాలి."

"ఊఁ అదికాదు. ఆమె సంపన్నుల కోడలవుతోందని అసూయ. పిల్లను ఉన్నచోట యిచ్చుకుంటే రేపు ముసలితనంలో మేమూ వాళ్ళ దగ్గరే వుండొచ్చుననే భరోసా అయినా వుంటుంది. నీ విషయంలో ఆ ఆశ అబద్ధమేకదా?"

చాల సేపు మౌనంగా వుండిపోయిన వకుళ తలెత్తి అన్నది.

"పెండ్లి పనులేమైనా వుంటాయి-వస్తాండమని నాన్నగారు చెప్తే వచ్చానమ్మా. నేనూ నా భర్తా ఎంత లేనివాళ్ళమో మరీమరీ విని అనుమానింప బడాలని కాదు. నీ ఆశలు కనీసం ఒక కూతురి విషయంలోనైనా నిజమౌతాయిలే. వెళ్తాను."

"మాట—అందరి ఎదుటా ఆ కుండలో నీళ్ళు పట్టుకోవడం చీదరగా వుంది, రేపు చుట్టాలు ఎదుట అవమానం, నాన్నగారు నీకు ఫ్రిజ్ కొనిమ్మన్నారు, అదుగో, అది నీకు, ఆనక మనుష్యుల్ని పంపి తీసుకుపో."

అటు తిరిగాయి వకుళ నేత్రాలు.

శశిరేఖ నిమిత్తం కొన్నది పెద్ద సైజుది. తమ ఇంట్లో పూర్వం వున్నది కూడా పెద్దదే. ఇది వాటిముందు చిన్న పెట్టెలా వున్నది.

"ఏ మాత్రం సంసారం గనుక? అందుకని చిన్నది కొన్నాను. బాగుందా?"

వకుళ మెల్లగా తలెత్తింది.

"బాగుందమ్మా. చాల బాగుంది. అక్కగారింట్లో నౌకర్లకు బాగుంటుంది. వాళ్ళకూ హోదా వుంటుందిగా?"

"ఏమిటి?"

"ఔనమ్మా. మాకెందుకివన్నీ? నువ్వు క్షేమగా ఒక కూతురికి కొంటూ రెండో కూతురికి కూడా కొంటే తీసుకుపోమను తప్పక. నీ అల్లుడి సుఖం కోసంఅని ఒక్క మాట

కే ఆయనకెలాగైనా నచ్చచెప్పి స్వీకరించేట్లు చేసేదాన్ని. కానీ నలుగురి ఎదుటా ్కువగా వుండరాదని తప్పని సరిగా కొన్నావు. అంతే. నువ్వు సగం మనసుతో యిచ్చే ు అక్కరలేదు నాకు. అతడి సత్య సంబంధతకు విలువ గుర్తింపబడి శ్రీమంత్ తన క్తితోనే శ్రీమంతుడౌతాడు. ఆనాడు తానే తన యింటికి అన్ని ఏర్పరచు ంటాడు. అతడిని నిరశించే ఎవరి బిజా అతడి కక్కరలేదు. వస్తాను మళ్ళీ అక్క పెళ్ళికి. స్తున్నాను.”

వెను దిరుగుతూనే ఆమే, తది తరులూ కూడ కొలదిక్షణాలు నివ్వెర పోయి నిస్తే లై నిలబడి పోయారు.

కారణం—ద్వారం పొడవునా శ్రీమంత్ నిలిచివున్నాడు. అతడి వదనం అతి ర్మలంగా నిర్వికారంగా వున్నది.

“వకుళా, దా నీకోసమే వచ్చాను. ఇదిగో టెలిగ్రాం. నాన్నగారూ, శారదా ్త్రికి వస్తారట, పద.”

“నమస్కారం అత్తయ్యా-”

మరో మాటకు కూడా చూడక వకుళతో కలిసి వెళ్ళిపోయాడు.

“సెలవే కదా, వుండరాదూ ఇవాళ్టికి?” ముందు గదిలోనున్న రఘురామయ్య న్నాడు.

“మళ్ళీ వస్తాంగా మామయ్యా” అంటూనే సాగిపోయాడు శ్రీమంత్.

కంఠం వరకూ దుఃఖం పూడుకొనివున్న వకుళ ఇంటికి వెళ్తూనే పోయి పూజ దిలో చతికిల బడింది రెండు చేతులలో ముఖం దాచుకుంటూ, శ్రీమంత్ వదలలేదు.

“ఏమిటి అక్కడ కూర్చున్నావ్? దా, లే.”

“ఇదే నాకు మిగిలిన స్థానం—నేను మాట్లాడగల తావు—నేనేదైనా అడగగల ోటు, అందుకని.”

ముఖంమీద ఆచ్ఛాదన తొలగలేదు. గళంలో సోకం పెల్లుబుకుతోంది.

సరసనే మోకాళ్ళపై ఆనుకు కూర్చున్నాడు శ్రీమంత్.

“వకుళా! నీకెంత గౌరవం—మరెంత నమ్మకం నాపై! ఎక్కడ దాచావు ఈ రాధన యిన్నాళ్ళూ?”

మంద్రమార్దవ స్వరాన అంటూ ఆమె శిరస్సును ఎదకు ఆనించుకొన్నాడు.

“ఇంతటి గుణశీలివైన నిన్ను నేను సరిగా ఆదరించ లేక పోతున్నాను కదూ?”

బెదరిపోతూ చూచింది వకుళ.

“నువ్వు....నువ్వు అంతా విన్నావా శ్రీమంత్?”

“ఆఁ.”

శ్రీమంత్ వదనం గంభీరంగా మారిపోయింది. ఆమెను వదలి దూరంగా వెళ్ళాడు.

“అంతా విన్నాను వకుళా. నువ్వు వంట ఇంట్లో వున్నప్పుడే వచ్చాను.” మీ నాన్న గారి దగ్గర కూర్చుని అంతా విన్నాను.”

“ఆఁ!”

“ఔను. ఎందుకలా ఖంగారు పడ్డావ్? నువ్వేమీ అనలేదుగా?”

వకుళ తలవాల్చి అన్నది.

“ఎందుకు అమ్మకింత నిరాదరణ మనమంటే? నేను చేసిన పాపమేమిటి?”

అర్థయుక్తంగా నవ్వాడు శ్రీమంత్.

“బజారులో ఎంత ఖరీదైనా సంపంగి పూలే కొంటారు కానీ కనకాంబరాలకు




విలువ వుందా? మంచి లైట్లు అమర్చి, షోకేస్‌లో వున్న ఒట్టలకే వెళ్తారు కానీ, రోడ్డు ప్రక్క అంతకంటే మంచివి వున్నా కన్నెత్తి చూస్తారా? అది ఖరీదైనవారి లక్షణం. మనిషికి కూడా అతడి ధరనూ, వెలనూ బట్టే గౌరవం!"

"అమ్మ........అమ్మకు "అయినది ఆకు కానిది కంచం" గా వున్నది శ్రీమంత్. నేను క్షమాపణ అడుగుతున్నాను నిన్ను ఆ యింటి కూతురివైనందుకు."

"మరి నా యింటి లక్ష్మివైనందుకు గర్విస్తున్నాను. ఇక ఆ సగంతి వదిలెయ్. ఇదిగో టెలిగ్రాం."

"అన్నట్టు........నువ్వీ సమయంయలో ఆఫీసునుంచి ఎందుకొచ్చినట్టు?"

"ఈ రోజు సెలవు కదూ? నేనూ మతిలేక వెళ్లి తిరిగి వచ్చాను."

"అన్నట్టు........ఈ టెలిగ్రాంలో శారద, మామగారు ఇప్పట్లో రావడం లేదని వుంది. అలా చెప్తావేం?"

"ఏదో–వాళ్ళ ఎదుట అలా మాట్లాడేశాను ఆగ్రహం అణచుకుంటూ. నువ్వు త్వరగా తయారుకా. ఈరోజు ఆఫీస్ స్టాఫ్ అంతా పిక్నిక్ ఏర్పాటు చేసుకున్నాం. పద."

"బాబోయ్!"

"ఏం?"

"ఆరోజు........అబ్బ. ఇబ్బందిగా వుంటుంది నాకు అలాటి చోట"

"నాకూను. కానీ తప్పదు. నలుగురితో నారాయణా అనాల్సిన కనీస విషయాలు కొన్ని వుంటాయి."

"ఏమోయ్ శ్రీమంత్? ఇంకా బయల్దేర లేదా?" అంటూ బిల బిలా నలుగురుతో పలికి వచ్చేశారు.

బయట బస్ హారన్ అదే పనిగా మ్రోగుతోంది.

"ఏమండి హనీమూన్ పెయిర్ రామంటున్నారా?" అని ఒకరూ.

"తప్పక రావలసిందే" అని ఒకరూ చుట్టు ముట్టారు.

"అబ్బే వచ్చేస్తున్నాం." శ్రీమంత్ అన్నాడు.

"త్వరగా రండి మరి. బయట నిలబడతాం. మాకు అతిథి మర్యాదలేం వద్దు మరదలు గారూ." అంటూ బయటకు నడిచారు. (సశేషం)

# మల్లాది వెంకట కృష్ణమూర్తి

## మి నీ క థ

# "పెళ్ళి చూపులు"

"సాయంత్రం కాలేజీ అయ్యాక మా ఇంటికోసారి రారాదు?" అడిగింది మైథిలి తన స్నేహితురాలిని.

"వస్తాను."

"నీవుకూడా రావే" సౌమిత్రికి చెప్పింది మైథిలి.

"ఎందుకు?" అడిగింది సౌమిత్రి.

"టీకి"

"ఏదైనా అకేషనా?"

"అవును"

"పుట్టిన రోజా?"

"నాకు పెళ్ళిచూపులు."

చిన్నగా ఈలవేసింది సౌమిత్రి.

"కంగ్రాట్స్. కుర్రాడేం చేస్తున్నాడు?"

"ఉద్యోగం."

"ఆదేతేవే-ఏం వుద్యోగం?"

"ఆర్.టి.సి. లో"

"జిల్లా పరిషత్ హైస్కూల్‌లో పనిచేసే సంబంధం ఏమైంది?"

"నీకెలా తెలుసు?"

"హైమని పిలిచావటగా రెండు నెలల క్రితం పెళ్ళి చూపులప్పుడు?"

"నీకు చెప్పిందా? రహస్యంగా వుంచమన్నానే?"

"నీనుంచి రహస్యంగానే వుంచింది—మన క్లాస్‌లో అందరికీ ఆ విషయం చెప్పిన సంగతి." నవ్వింది సౌమిత్రి.

"ఆ సంబంధం?" అడిగింది మైథిలి స్నేహితురాలు.

"థంబ్స్ డౌన్ ఎప్పటి లాగానే."

"కట్నం నచ్చలేదా?"

"నేను."

"హైమని పిలవటంలేదా ఈసారి?" సౌమిత్రి అడిగింది.

"ఊహు. చెప్పకు దానికి."

"ఎలా వుంటుందే పెళ్ళి చూపులు?"

"చూస్తావుగా రేపెప్పుడో నీకూ అనుభవం అవుతుంది. తప్పదు."

"నాది ప్రేమ వివాహం-నీలాగ కాదు."

"నిన్ను, నన్ను ఎవరు ప్రేమిస్తారే?"

"ష్! క్లాసులో వుంటే వుండండి లేక పోతే బయటకు వెళ్ళండి. ఏమిటా మాటలు పాఠం వినకుండా?" కోపంగా అరిచింది ఇంగ్లీష్ లెక్చరర్. మైథిలి, సౌమిత్రి, వాళ్ళ స్నేహితురాలివంక చూసి.

ముగ్గురూ వెంటనే పుస్తకంలోకి సీరియస్‌గా చూస్తున్నట్లు నటించారు.




'ఓడ్ టు ది వెస్ట్ విండ్' పద్యం కనపడింది వాళ్ళకి.

○ ○ ○

సంవత్సరం మీద కొన్ని నెలలయ్యాక ఓ రోజు సౌమిత్రికి బెజవాడ రైల్వే స్టేషన్ లోని వెయిటింగ్ రూంలో కనపడింది మైథిలి.

"ఏమే ఎలావున్నావ్? కొడుకా?" అడిగింది సౌమిత్రి మైథిలిని చేతిలోని బిడ్డని చూసి.

"కాదు. కూతురు... ఏమండీ నా స్నేహితురాలు సౌమిత్రి తెలుసుగా?" అడిగింది మైథిలి భర్తని సౌమిత్రికి పరిచయం చేస్తూ.

"గుర్తులేదు." చెప్పాడాయన.

"నా పెళ్ళిచూపులకి సౌమిత్రి కూడా వచ్చింది. మర్చిపోయినట్లున్నారు."

"ఓ హో హో. అలాగా. గుర్తొచ్చింది." నవ్వాడాయన.

"ఎక్కడికి నువ్వు?"

"గుంటూరులో ఏదో వుద్యోగానికి ఇంటర్వ్యూవస్తే వెళ్తున్నాను."

"వుద్యోగం ఎందుకే హాయిగా పెళ్ళి చేసుకోక?" చెప్పింది మైథిలి.

"పెళ్ళి చూపుల్లో అన్నీ థంబ్స్ డౌన్ ఇప్పటిదాకా" విచారంగా చెప్పింది సౌమిత్రి.

"మీకో చిట్కా చెప్పనా? అడిగాడు మైథిలి మొగుడు సౌమిత్రిని.

"ఏమిటి? చెప్పండి."

"పెళ్ళి చూపుల్లో హైమలాంటి మీ కన్నా అందమయిన స్నేహితురాళ్ళనికాక మీ కన్నా అంద విహీనమయిన వాళ్ళని పక్కన వుంచుకోండి చాలు. మీరు బ్రహ్మాండంగా వుంటారు చూసేవాళ్ళకి."

"ఏమిటండి ఆ మాటలు?" చిరుకోపంగా అన్నది మైథిలి భర్తతో.

"నాకేం తెలుసు! ఇది నువ్వు ఆచరించిన వుపాయమేగా" మృదువుగా నవ్వాడు. ★

# మీనాక్షిపురాయుధం

## నగ్నముని

జమ్మిచెట్టుమీద
ఆయుధాలు దాచిన పురాణపురుషుడు
యుద్ధసమయంలో తిరిగి దించాడు
భళిభళీ యన్నారు ధర్మవిజయ కాంక్షితులు

కులరాక్షసి వూడలు బలంగా దిగి విస్తరించిన
మతం మర్రినుండి మార్పిడి మారణాయుధం తీశాడు
శతాబ్దాలుగా అణచబడిన అంటరానివాడు
హిందూ ఎముకల్లో యిప్పుడెందుకీ ఒణుకు
ఈ ఇంట్లో అస్పృశ్యుడు
మరో ఇంట్లో వుంటేనేం
నీడకి ప్రాణమొచ్చి ఎదురుగా నిలబడితే
నిలువునా కంపిస్తాడు శపిస్తాడు
ఇంకొకడు తనకి నీడగా బతకాలనే సవర్ణుడు

నీటిలోని చేప ముఖంలో కన్ను
అందాన్ని వర్ణించే అధివాస్తవికాలంకారం
అందంగా అట్టడుగున పాతేసిన నిజం
న్యూన హీన ప్రవాస కులం విడిచిన కుబుసం
మీనాక్షిపురం

కులం మడుగులో మతం మొసలి నోట్లో చిక్కి
ఆదికాలంనుండి నిస్సహాయంగా ఆక్రందిస్తున్నవాళ్ళని
హరిజనమని అపహాస్యం చేసి వినోదిస్తున్నవాళ్ళు
మడుగునీ మొసలినీ రక్షిస్తూ
రాజకీయ పావులుగా ఆడుకుంటూన్నవాళ్లు
ఇప్పుడెందుకు హఠాత్తుగా కలవరపడుతున్నారు

ఆర్తత్రాణ పరాయణుడుగా
అరబ్బు లక్ష్మీసమేతంగా అల్లాయే దిగివచ్చినందుకా!

భగవంతుడొక్కడే
మతాలన్నీ ఒక్కటే
అని భజనలు చేసే భక్తులంతా ఏమయ్యారు

కులవ్యవస్థని కించపరచకుండా
మొదలంతా కుళ్ళగించకుండా
మతాన్ని నల్లమందుతో సుందరంగా పోల్చి
మతం మొసలిపట్టుని తక్కువ అంచనా వేసి
సమసమాజ స్థాపనకు యుద్ధం చేస్తున్నామంటున్న
గతితార్కిక అద్వైతులెక్కడ
చరిత్రను అధ్యయనం చేశామంటున్నవారంతా
ఈ దేశ జీవిత వాస్తవానికి దూరంగా
స్వప్న యుద్ధభూముల్లో వీరవిహారం చేస్తున్నారు

అసలు కారణాలకి దూరంగా
అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి
పాపపుణ్యాలగురించి ప్రవచించాక
పవిత్ర గ్రంథాలు పడుకున్నాయి
మ్యూజియంలోంచి బయటికొచ్చి
మీసం దువ్వుతూ మెడమీద వేలాడుతోంది
మీనాక్షీపుర మారణాయుధం

తర్కాన్ని ఆపి మతి తెరిచి చూడు
మతం మారుస్తామనీ
మతం మార్చుకుంటామనీ
రకరకాల కారణాలతో బెదిరిస్తున్నారు
చూడు చూడు
మనుషుల మౌతామని
ఒక్కరూ బెదిరించడంలేదు
పంజరంలోంచి పంజరంలోకి
పదిలంకోసం ప్రయాణిస్తామంటున్నారు
పంజర వ్యాపారుల్ని పోషిస్తున్నారు
మనుషుల్ని ఒకటి చెయ్యలేకపోయిన
మతాల్ని సమాధి చేస్తామనడంలేదు
స్మశానంలో ఒక గోరీనుండి
మరో గోరీలోకి మారతామంటున్నారు
'లౌకిక'మంటే మతలౌక్యం కాదు
మతరహితం
సవాలు చెయ్యదలచుకుంటే
ఈ స్మశాన వ్యవస్థ సర్వాంగాలనూ
సవాలు చెయ్యి

మనుషులమౌతామనే భావాన్నే ఆయుధం చెయ్యి
ఈ కులమత భూతప్రేత సౌధాన్ని కూలదొయ్యి

# సప్తమ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు

గతంలో ఆరుసార్లు హైదరాబాదు, రాజమండ్రి, తిరుపతి, బెంగుళూరు లలో జరిగిన అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు ఏడవసారి నవంబరు, 14, 15, 16 తేదీలలో విశాఖపట్నం సాంబమూర్తి కళామందిరంలో జరిగాయి అభాసుపాలవుతాయేమోనని కొందరు శంకించినా విశాఖ సభలు విజయవంతంగా జరిగాయనే చెప్పుకోవచ్చు. ఇందుకు అఖిల భారత తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శి శ్రీ పోతుకూచి సాంబశివరావు ప్రధాన కారణం.

ఈ మహా సభలకు దేశంలో అన్ని ప్రాంతాలనుంచీ, దాదాపు 425 మంది ప్రతినిధులు విచ్చేశారు. కవులు, పండితులు, రచయితలు. సాహితీపోషకులు, విమర్శకులు అందరూ ఒకచోట కలుసుకున్నారు. ఎందరో సాహితీ బంధువులు కూడా మూడు రోజుల సమావేశాలను శ్రద్ధగా చూడడమే కాకుండా, కొందరు ఎంతో ఉత్సాహంతో చర్చలలో పాల్గొని తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు' విశాఖ పట్నంలోని మూడు వంతుల రచయితలు రచయిత్రులు పాల్గొన్నారు.

ఈ సభలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారాన్ని అందించాయి. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారు 14వ తేదీ శనివారం ఉదయం 11 గంటలకు జరిగిన ప్రారంభ సభకి అధ్యక్షత వహించారు. వారు తమ అధ్యక్షోపన్యాసంలో రచయితలు సామాజిక సమస్యలను, తమ రచనల్లో ప్రతిబింబింప చేయాలని, సంఘంలోని దురాచారాలని తొలగించడానికి పరిష్కార మార్గాలు సూచించాలన్నారు. రచనల్లో రాజకీయ సిద్ధాంతాలు చొప్పించ కూడదన్నారు. సమాజాభివృద్ధికి అడ్డంకులుగా ఉన్న కుల, మత భాషా విభేదాలను తొలగించడానికి రచయితలు తమ సృజనాత్మక శక్తిని ఉపయోగించాలని కోరారు. కొత్త రచయితల పుస్తకాలు అచ్చు వేసుకోవడం కోసం, రచయితల సహకార సంఘాలకు తగిన సహాయం అందించడానికి ప్రభుత్వం వెనుకాడదని చెప్పారు. తెలుగు ప్రజల గౌరవాన్ని, సంస్కృతిని పెంపొందించడానికి మంచి సాహిత్యం వెలువడాలన్నారు.

మహా సభల అధ్యక్షులు శ్రీ ఆవుల సాంబశివరావు తమ స్వాగతో పన్యాసంలో ఈ మహా సభలలో భారతీయ భాషలలో తెలుగు స్థానాన్ని గురించి ప్రధానంగా చర్చిస్తారని చెప్పారు.

శ్రీ వి. నారాయణరావు ఐ. ఏ. యస్ ఈ మహా సభల ఉపాధ్యక్షులు. ఈ సందర్భంగా ప్రత్యేక సంచిక "విశాఖ" ను సమర్పించారు. ఈ ప్రత్యేక సంచికను విశాఖ పట్నం మేయరు శ్రీ యస్. యన్. యన్. రెడ్డి ఆవిష్కరించారు. ఈ మహాసభలు జవహర్ లాల్ నెహ్రూ పుట్టిన దినాన ప్రారంభం కావడం ఒక ప్రత్యేకత. ప్రత్యేక సంచికను నెహ్రూ పండితునికి అంకితం చేశారు.

మహా సభల అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజ రావు తెలుగు భాష

సాహిత్యాల గొప్పదనం గురించి ప్రసంగిస్తూ, తెలుగు సాహిత్యంలో వచ్చిన వివిధ ఉద్యమాలను కూడా వివరించారు.

విశాఖ జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ ద్రోణంరాజు సత్యనారాయణ పుస్తక, చిత్రలేఖన ప్రదర్శనను ప్రారంభించారు.

డా. సి. నారాయణ రెడ్డి మాట్లాడుతూ, కొందరు రచయితలు ఉద్దేశపూర్వకంగా ఈ మహాసభలకు రావడం లేదన్న విషయాన్ని చెబుతూ "రచయితలు అస్పృశ్యతను పాటించకూడదు." అన్నారు.

ఆస్థాన కవి డా. దాశరధి అభినందన చదివారు.

ప్రథమ మహాసభలలో ఇంతవరకూ జరిగిన విశేషాలను సమీక్షిస్తూ, తీసుకున్న నిర్ణయాలు, తీర్మానాలూ ఎంతవరకూ అమలు జరిగేయో వివరిస్తూ అఖిల భారత తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శి, శ్రీ పోతుకూచి సాంబశివరావు నివేదిక సమర్పించారు.

ఈ మహాసభలో "సాంప్రదాయ సాహిత్యం-ఆధునిక పరిశీలన" "తెలుగు భాషా సాహిత్యాలు - ప్రచార సాధనాలు" "గతదశాబ్దంలో తెలుగు సాహిత్యవికాసం" "ఆధునిక సాహిత్యం - భవిష్యద్దర్శనం" "రాష్ట్రేతరాంధ్రులు - సాధక బాధకాలు" "భారతీయ భాషా సదస్సు" "సంపాదకుల వేదిక" అనే అంశాల పై చర్చాగోష్ఠులు జరిగాయి.

ఈ చర్చా గోష్ఠులలో డా. నాయని కృష్ణకుమారి, డా. ఆర్. అనంతపద్మనాభరావు, డా. వాసా ప్రభావతి, శ్రీ గంధం అప్పారావు, డా. కొర్లపాటి శ్రీరామమూర్తి, సర్వశ్రీ డి. బాలకృష్ణ,

# నవకవితా...గుంతా...

(శ్రీRUMగం శ్రీనివాసరావు గారి 'నవకవితకి' పేరడీకాదు..'బారడీ')

స్కాచ్ విస్కీ, స్పెన్సర్ సోడా
స్టేటెక్స్ ప్రెస్, గ్యాసు లైటరూ
తెల్లగ్లాసు, చల్లని ఐసూ
మటన్ చిప్స్. బాయిల్డెగ్సూ
కావాలోయ్ నవకవనానికి

ఇరానీ తందూరీలూ
బిర్యానీ జింజెర్ చికెనూ
పీటీవక్క నుల్లి ముక్కలూ
వాటిమీద నిమ్మ చెక్కలూ
కావాలోయ్ నవ కవనానికి

చైనీస్ బామ్మా
జపాను కారూ
ఇంగ్లండు ఫోర్కూ
రష్యా చాకూ
కావాలోయ్ నవ కవనానికి

ఎక్కేదీ, కిక్కెచ్చేదీ
తాగాక తూగించేదీ
తూగిస్తూ వాగించేదీ
దేకిస్తూ దోకించేదీ
కావాలోయ్ నవ కవనానికి
కవి వమనానికి

తనికెళ్ల భరణి

పన్యాల రంగనాథరావు, డి. రామలింగం, నెల్లూరి కేశవస్వామి, శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం, డా. సి. నారాయణ రెడ్డి, ఆరుద్ర, డా. శ్రీమతి సి. ఆనందారామం, డా. జి. వి. సుబ్రహ్మణ్యం, వాసిరెడ్డి సీతాదేవి, అద్దేపల్లి రామమోహనరావు, డా. లత, డా. కె.వి. కృష్ణకుమారి, శ్రీమతి వాచస్పతి, శ్రీ వా వి లా ల గో పా ల కృష్ణయ్య, శ్రీ పడిద గోపాలరావు, శ్రీ ఎం. ఎస్. ప్రకాశ రావు- శ్రీ బయ్యా సూర్యనారాయణ, మూర్తి, ఎ. శ్యామలా రాణి, శ్రీ సి.కె. నాగరాజరావు, శ్రీ నిరంజన్ మహంతి, శ్రీ ఖాడాల రామయ్య, శ్రీ నరసయ్య, ఆబిద్ అలీఖాన్, శ్రీ కె. సత్య సుబ్రహ్మణ్యం, శ్రీ యన్. ఆర్. చందూర్, శ్రీ తిమ్మరాజు వెంకటశివరావు, శ్రీ ఏ. చక్రపాణి. ప్రభుత్వ చీఫ్ విప్. పి. జగన్ మోహన్ ఐ. పి. యస్, డి. జనార్దన్ ఐ.పి.యస్. ప్రభృతులు పాల్గొన్నారు.

15-11-81 ఆదివారం విశాఖ పట్నం కలెక్టరు శ్రీ అగ్నిహోత్రి అధ్యక్షతన లబ్ధ ప్రతిష్ఠులే కాక కొత్తగా రచనలు సాగి స్తున్న కవులు కవితలు వినిపించారు. సుమారు వందకిపైగా కవులు పాల్గొన్న ఈ కవితా సదస్సు చాలా ఆసక్తి కరంగా సుమారు నాలుగు గంటలసేపు జరిగింది.

"రాష్ట్రేతరాంధ్రులు— సాధక బాధ కాలు" అన్న అంశంపై తమ సాధక బాధకాలు వివరిస్తూ బెంగుళూరునుంచి వచ్చిన శ్రీ ఎం. ఎస్. ప్రకాశరావు, ఢిల్లీ నుంచి పడిద గోపాలరావు, కొచ్చిన్, భిలాయ్, ఖరగ్‌పూర్, వారణాసి, బరం పురం, మద్రాసునుంచి వచ్చిన ప్రతినిధులు, వారి సాధక బాధకాలు వివరిస్తూ అక్కడ వారి కుండే అవసరాలను తీర్చడానికి ఈ అఖిల భారత తెలుగు రచయితల మహా సభలవారిని రాష్ట్రంలోని తెలుగు ప్రజలను తగిన సహాయ, సహకారాలను అందజేయ వలసినదిగా కోరేరు.

"సంపాదకుల వేదిక" - ఈ సభలలోని ప్రత్యేకత—పత్రికల్లో ప్రచురింపబడుతున్న, సాహిత్యాన్ని గురించీ, వివరించారు. అదే కాకుండా సభాధ్యక్షులు శ్రీ కె.యస్. సుబ్రహ్మణ్యం సభలో ఉన్నవారిని కూడా వేదికపైకి ఆహ్వానించి, వారి అభిప్రాయా లను కూడా సభాముఖంగా వ్యక్తం చేయ డానికి అవకాశం ఇచ్చారు.

16 తేది మధ్యాహ్నం జరిగిన సర్వసభ్య సమావేశంలో రచయితల సహకార సంస్థ స్థాపించాలనీ. రచయితల పుస్తకాలను గ్రంథాలయ సంస్థల వారు కొనుగోలు చేయాలనీ, రచయితలకు కూడా ప్రభుత్వం వారు ఇళ్ళ స్థలాలను కేటాయించాలనీ, తీర్మానాలు చేశారు. వీలయినంత త్వరలో సర్వసభ్య సమావేశం జరిపి ఎన్నికలు జర పాలని తీర్మానించారు.

16వ తేదీ సాయంత్రం జరిగిన ముగింపు సమావేశానికి మహాసభల ఉపాధ్యక్షులు శ్రీ వి. నారాయణరావు అధ్యక్షత వహిం చారు. శ్రీ బి. టి. యత్. యన్. చౌదరి ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ప్రథమ మహాసభలనుండి, ఇంతవరకూ జరిగిన అన్ని సభలకూ అనేక సహకారం అందించిన కార్య కర్తలకు "సరస్వతీ చిత్రం" మెమొంటోలు బహుకరించారు. ఆహ్వాన సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ గణపతిరాజు అచ్యుత రామరాజు మహా సభల ప్రధాన కార్యదర్శి పోతుకూచి సాంబశివరావు వందన సమర్పణ చేశారు.

ఈ మహాసభల సందర్భంగా విశాఖ పట్నం ఆకాశవాణి కేంద్రం వారు హృద్యమైన సంగీతం వినిపించారు. శ్రీ బి.యస్. భాస్కరరావు "మయసభ" ఏక పాత్రాభినయం చేశారు.

-మంత్రిప్రగడ శేషాబాయి

# సినిమా:

## మహాప్రస్థానం

ఒకే షెడ్యూల్‌లో విజయవాడ చుట్టు పక్కల ప్రాంతాల్లో ఈ చిత్ర నిర్మాణం ఆరంభమవుతోంది. మాదాల రంగారావు నిర్మాణ సారథ్యంలో తయారయే ఈ వర్ణ చిత్రానికి శ్రీ శ్రీ మాటలూ, పాటలూ కూర్చటం ఓ విశేషం- హేమాంబర ధరరావు ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. కెమెరా ఆర్.రామారావు, ఎడిటింగ్ సుబ్బారావు, సంగీతం చక్రవర్తి వహిస్తున్నారు.

సమర్పిస్తున్నవాడు రెండు శ్రీలను ధరించినవాడు!



"సీతాదేవి" సుజాత చిరంజీవి....



"సుబ్బారావుకి కోపం వచ్చింది"—వనిత

Edited & Pu lished by V. Leelavathy Raghavaiah, at 1-8-4/1/1 Chikkadpalli, Hydarabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1 8-4/1/1 Chikkadpalli, Hy erabad-500 020.

# కోటి వెలుగుల సంక్రాంతి ఇది:
# మేటి పథకాల ఆంధ్రా బ్యాంక్ మీది!

గృహకల్ప - మీకంటూ ఒక ఇంటి కోసం

మహిళా సంక్షేమ - వనితలకు భవిష్యత్తులో భద్రతకోసం

కర్షక సహాయ - రైతుసోదరుల సంక్షేమం కోసం

సంరక్షణ - వృద్ధాప్యంలో రక్షణ కోసం

సంక్షేమ - [illegible] రక్షణ కోసం

[illegible] - [illegible] నుండే పొదుపు

కల్పతరువు - మీ భవిష్యత్ అవసరాల కోసం

ఇవే కాక

## ఆంధ్రా బ్యాంకార్డ్, ట్రావెలర్స్ చెక్స్-

మరెన్నో పథకాలు ... ...

ప్రజావసరాలకై పాటు పడేదే — ఆంధ్రాబ్యాంక్

## సంక్రాంతి శుభాకాంక్షలతో



## ఆంధ్రా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంస్థ)

కేంద్ర కార్యాలయం : సుల్తాన్ బజార్

హైదరాబాద్ — 500 001